మీరు చదువుతున్నారా?

# వనిత



అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో



ఉదయించి పదిహేడు సంవత్సరాలుగా

మన వనితల వికాసానికి తోడ్పడుతున్న

ఏకైక పత్రిక **వనిత**

నెలతల ప్రియ నెచ్చెలి

• విజ్ఞానానికి • వికాసానికి • వినోదానికి

TL—F-1



# చందమామ

జూన్ 1993

*

ఈ సంచికలో కథలు–వింతలు–విశేషాలు



*

విడి ప్రతి : 4.00
సంవత్సర చందా : 48.00

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

నంవత్సర చందా :

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా : రూ. 105.00 ఎయిర్ మెయిల్ ద్వారా : రూ. 252.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా : రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా : 252.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి :

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## తల్లి తండ్రుల బాధ్యత!

ఆట పాటల పట్ల ఆసక్తి చూపకుండా పొద్దస్తమానం చదువుతూ ఉండడం పిల్లల ఆరోగ్యానికీ, సంపూర్ణాభివృద్ధికీ అంత మంచిది కాదని మనస్తత్వ వేత్తలు చెబుతారు. అయితే, పరీక్షలసమయంలో ఆటపాటలను పక్కకు పెట్టి, చదువు మీదనే దృష్టిని కేంద్రీకరించడం ఈనాటి విద్యార్థులకు తప్పనిసరి అవుతున్నది.

ఇప్పుడు పరీక్షలన్నీ అయిపోయి పిల్లలందరూ సెలవులలో ఉన్నారు. కాబట్టి, మిత్రులతో కలిసి ఆటలాడు కోవడం, బంధు మిత్రుల ఇళ్ళకు వెళ్ళి హాయిగా గడపడం, లోకజ్ఞానం పెంపొందించే పుస్తకాలూ, కథలూ చదవడం చేస్తూ ఉంటారు. ఇవి పిల్లలో నూతనోత్తేజం కలిగిస్తాయి.

బాల్యానికి మరోపేరు ఆటపాటలు. పిల్లల మధ్య అమూల్యమైన మైత్రీభావం పెంపొందడానికి క్రీడలు దోహదం చేస్తాయి. కొత్త మిత్రులను సంపాయించడానికీ, ఉన్న మైత్రిని మరింత పటిష్టం చేసుకోవడానికీ ఇవి ఉపయోగ పడతాయి.

అయితే, నగరాలలో ఆకాశాన్నంటుతూ టెనమెంట్లు లేస్తున్న ఈ కాల ఘట్టంలో పిల్లలకు అగ్గిపెట్టెలవంటి తమ ఇళ్ళ నుంచి బయటకు వచ్చి ఆడుకునే అవకాశమే లేకుండా పోయింది. వారికి ఆలోపం లేకుండా సరిదిద్దే బాధ్యతను తల్లిదండ్రులు స్వీకరించాలి. ఇటువంటి పిల్లలకు తల్లిదండ్రులే స్నేహితులుగా మసలుకోవలసిన అవసరం ఎంతయినా ఉన్నది. తమకు ఎన్ని పనులున్నప్పటికీ రోజూ కనీసం ఒక గంటసేపయినా పిల్లలతో స్నేహంగా, సరదాగా గడపడానికి ప్రయత్నించాలి. పిల్లల మానసిక వికాసానికీ, వారిలో మానవతావిలువలను పెంపొందించడానికీ ఇది చాలా ఉపయోగపడుతుంది!

సంపుటి 91 జూన్ '93 సంచిక : 6

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



మీరు చదువుతున్నారా?

26 సంవత్సరాలకు పైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, ఇటు పరిశ్రమలోనూ,
అటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న

ఏకైక మాసపత్రిక

# విజయచిత్ర







వార్తలు - విశేషాలు :

# శ్రీ కంచి కామకోటి పీఠాధిపతి

కంచి కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి మహాస్వాముల వారి శతజయంతి ఉత్సవాలు 1993వ సం॥ మే నెలలో ప్రారంభమయ్యాయి. యేడాది పాటు ఈ ఉత్సవాలను ఘనంగా జరుపుకోవాలని భక్తులు నిర్ణయించారు. శ్రీ చంద్రశేఖరేంద్ర స్వాములవారిలాగా ఇంత సుదీర్ఘకాలం మరెవరు గాని మరే మఠానికి గాని పీఠాధిపతిగా ఉన్నట్టు దాఖలాలు లేవు.

ఈనాటి పరమాచార్యులు 86 సంవత్సరాలకు పూర్వం ఆదిశంకరుల వారసులుగా కాంచీపుర మఠానికి 68వ శంకరాచార్యులుగా చాలా విచిత్రమైన పరిస్థితులలో నియమించబడ్డారు. 66వ ఆచార్యులయిన శ్రీ చంద్రశేఖర సరస్వతి 1906వ సం॥లో 12 ఏళ్ళ స్వామినాథన్ అనే బాలుణ్ణి చూశారు. ఆబాలుడి కళ్ళలోని వింతశక్తి స్వామి వారిని ఆకట్టుకున్నది. ఆబాలుడిలో ఆయన 'జగద్గురు' అయ్యేలక్షణాలను చూశారు. తన తదనంతరం ఆ బాలుడే కంచిమఠ పీఠాధిపతి కావాలని తనవెంట ఉన్న పండితులతో చెప్పారు.

మరుసంవత్సరం 66వ ఆచార్యులు కంచి సమీపంలోని 'కలవై'అనే గ్రామంలో పరమపదించారు. ఆ సమయంలో స్వామినాథన్ దిిండివనం అనే ఊళ్లో ఒక క్రిస్టియన్ మిషనరీ స్కూల్లో చదువుకుంటున్నాడు. స్వామినాథన్ పెదతల్లి కుమారుడు అంతకుముందే కంచి పీఠాధిపతి వెంట ఉండడం వల్ల, ఆయనను 67వ శంకరాచార్యులుగా నియమించారు. ఆ విషయం తెలియగానే, ఉన్న ఒక్క కుమారుణ్ణీ మఠానికి వదులుకున్న వితంతువయిన పెదతల్లిని ఓదార్చడానికి బయలుదేరిన తల్లి వెంట వెళ్ళాడు స్వామినాథన్.

తల్లీ కొడుకులు కంచికి చేరగానే, కంచి పీఠానికి చెందిన ఒక సన్యాసి, కొడుకును తల్లి నుంచి విడదీసి, కలవైకి తీసుకువెళ్ళాడు. మార్గమధ్యంలో ఆయన ప్రస్తుత పీఠాధిపతి కూడా హఠాత్తుగా అనారోగ్యం పాలయ్యాడనీ, అందువల్ల స్వామినాథన్ 68వ శంకరాచార్య పదవీ బాధ్యతలు చేపట్టాలనీ కోరాడు. అంటే అతడు ఆ క్షణం నుంచి కుటుంబ బంధాలను వదులు కోవాలన్న మాట!

ఆ విషయం గురించి ప్రస్తావించినప్పుడు, పరమాచార్యులు, "అనుకోని ఆ సంఘటనలు నాకు దిగ్భ్రాంతిని కలిగించాయి. ఎద్దుల బండిలో కూర్చుని రామనామ స్మరణతో మిగతా ప్రయాణం ముగించాను", అన్నారు.

టెలిగ్రామ్ ద్వారా స్వామినాథన్ తండ్రినుంచి అనుమతి పొందారు. 1907వ సం॥ ఫిబ్రవరి 13వ తేదీ స్వామినాథన్ కంచి కామకోటి పీఠం 68వ శంకరాచార్య పదవీ బాధ్యతలు చేపట్టారు. 66వ ఆచార్యుల నామధేయాన్ని స్వీకరించారు.

యువప్రాయంలో ఉన్న చంద్రశేఖరేంద్ర సరస్వతి, మునుముందు నిర్వర్తించవలసిన గురుతరమైన బాధ్యతల దృష్ట్యా, ఏకాంతంలో విద్య, తపస్సుల ద్వారా తన్నుతాను సిద్ధం చేసుకోసాగారు. లోక కల్యాణం కాంక్షించి, అహోరాత్రులు నిరంతర ఆధ్యాత్మిక సాధనలో గడిపారు.

1909వ సం॥ నుంచి 21 సంవత్సరాలు భారత దేశమంతటా ఆదిశంకరుల పద్ధతిలో 'దిగ్విజయం' సాగించారు. ఆయన ఎంత దూరమైనా సరే కాలినడకతోనే వెళ్ళేవారు. మరీ తప్పనిసరి అయినప్పుడు మాత్రమే పల్లకీని వాడేవారు!

పండితులయిన పరమాచార్యులకు లాటిన్, ఫ్రెంచి, గ్రీకు భాషలతో సహా 17 భాషలు తెలుసు. గ్రీకు రాజమాత ఆయనను, 'నిర్మలమైన ఆధ్యాత్మిక స్వరూపం' అనీ ఆమె కూతురు, 'ఆయనను దర్శించడం, సంపూర్ణత్వాన్ని సందర్శించడం' అనీ తమ ఆధ్యాత్మిక అనుభూతులను వ్యక్తం చేశారు. ఒక అమెరికా దౌత్యాధికారి పరమాచార్యులను, 'సన్యాసులలో రాజు' అని వర్ణించారు.

1927వ సం॥ లో గాంధీజీ, కంచిపరమాచార్యులూ చాలాసేపు మాట్లాడుకుంటూండగా, రాజాజీ వచ్చి, గాంధీజీతో, "భోజనానికి వేళయింది", అని గుర్తు చేసినప్పుడు, గాంధీజీ, "ఆచార్యులతో సంభాషించడమే నాకు ఈ సాయంకాల భోజనం!" అన్నారట.

సాధారణంగా 84 సంవత్సరాలు జీవిస్తేనే 'వేయిపున్నములు' చూశారు కనక 'శతాబ్ది అభిషేకం' చేయడం ఆనవాయితీ. అయితే, కంచి పరమాచార్యుల వారు పూర్తిగా వంద సంవత్సరాలు జీవించడంతో 'శతాబ్ది మహోత్సవాలను', ఘనంగా జరపడానికి భక్తులు పూనుకున్నారు.

'జీవితం నాకు నేర్పిందేమిటి?' అన్నవ్యాసంలో కొన్నేళ్ళక్రితం పరమాచార్యులు ఇలా పేర్కొన్నారు: "నాకు జీవితం నేర్పింది ఇది ఒక్కటే – ఇతరులకోసం జీవించడానికే దేవుడు కొందరిని సృష్టించాడు!"

<u>పరమాచార్యుల సుభాషితాలు :</u>

వివిధ మతాల సిద్ధాంతాలలో, ఆచారవ్యవహారాలలో భేదాలు ఉండడం తప్పలేదు. అన్నిటినీ ఒకటిగా చేయనవసరంలేదు. అయితే, మతాల మధ్య సామరస్యం అవసరం; ఐకమత్యం చాలాముఖ్యం.

ఒక క్రమమూ, తీరూతెన్నూ లేని పనులతో ఈనాటి ప్రపంచం లోని ఉద్రిక్తతలకు తట్టుకుని బతకడం కష్టం. ఈ విషయంలో క్రమశిక్షణ మనకెంతో ఉపకరిస్తుంది. క్రమశిక్షణ మనం అలవరచుకోవలసిన ముఖ్యమైన సుగుణం. ఎదుటి వారికి ఎటువంటి ఇబ్బందీ కలగకుండా మనకర్తవ్యాలనూ, బాధ్యతలనూ జాగ్రత్తగా, భక్తితో నెరవేర్చడం ద్వారానే ఈ క్రమశిక్షణను అలవరచుకోవడం సాధ్యం. మంచి పనులు చేయడానికి మాత్రమే ఇదిదోహదం చేయడం వల్ల, మనలను నిర్మలంగానూ, సంతోషంగానూ ఉంచుకోవచ్చు.





# అత్త - కోడలు

శ్రీపురం అనే గ్రామంలో భూషయ్య అనే చిన్న భూస్వామి వుండేవాడు. ఆయన భార్య కామాక్షమ్మ నోటిదురుసు మనిషి. మొదట్లో భూషయ్య,కామాక్షమ్మను అదుపు చేయాలని చూశాడు. కానీ, ఆయనలోని మెతకదనం గమనించి కామాక్షమ్మ మరింత నెత్తికెక్కింది. చేసేదిలేక భూషయ్య వూరుకున్నాడు.

భూషయ్య, కామాక్షమ్మలకు ముగ్గురు కూతుళ్ళు, ఒక్కడే కొడుకు. పెద్దకూతుళ్ళిద్దరూ, కొడుకూ కామాక్షమ్మ ఏం చెబితే, దానికల్లా తలలు వూపేవారు. అందువల్ల, కామాక్షమ్మ వాళ్ళ విషయంలో దిగులు పడేది కాదు. మూడో కూతురు చందన తండ్రి స్వభావం. ఎవరితోనూ అంతగా మాట్లాడేది కాదు. మాట్లాడితే, ఆ మాటల్లో అభిమానం, గౌరవం వుండేవి. ఇది చూసిన కామాక్షమ్మ చిన్నప్పటి నుంచీ చందనను తనలాగా తయారు చేయాలని విశ్వ ప్రయత్నం చేసింది. ఆ ప్రయత్నం పూర్తిగా ఫలించకపోయినా, చందన స్వభావంలో కొంత మార్పు తెచ్చింది.

పనివాళ్ళను తేలిగ్గా చూడ్డం, పెద్దలను లెక్కచేయకపోవడం వంటి మార్పులు గమనించిన భూషయ్య, ఆమెను పిలిచి మంచి మాటలు చెప్పేవాడు.

ఈ విధంగా, ఇతరులపట్ల తల్లి ప్రవర్తన తప్పని తండ్రీ, తండ్రి ప్రవర్తన తప్పని తల్లీ చెబుతూండడంతో, ఏది చెడో, ఏది మంచో తెలుసుకోలేని అయోమయంలో పడింది, చందన.

చందన యుక్తవయసుకు రాగానే, తండ్రి భూషయ్య ప్రమేయం ఏమీ లేకుండా, కామాక్షమ్మ ఆమెకు కేశవుడనే యువకుడితో పెళ్ళి సంబంధం నిశ్చయం చేసింది. కేశవుడు బాగా చదువుకున్నవాడు.

ఎన్. శివనాగేశ్వరరావు

దివాణంలో ఉద్యోగం. తండ్రి లేడు; తల్లి, ఒక చెల్లెలు మాత్రం వున్నారు. చెల్లెలికి పెళ్ళయి, వేరే ఊరిలో వుంటున్నది. కేశవుడికి ఆస్తి పెద్దగా లేకపోయినా, ఏ బాదరబందీలు లేవనీ,కూతురు సుఖపడుతుందనీ భావించింది, కామాక్షమ్మ.

ఒకరోజు చందన స్నేహితురాలు విమల, కామాక్షమ్మ ఇంటికి వచ్చింది. విమలకు పెళ్ళయి ఏడాది అయింది. చందన, విమల మాట్లాడుకుంటూంటే మధ్యలో కామాక్షమ్మ కల్పించుకుని విమలను, "ఏమ్మా, ఎలా వుంది నీ కాపురం?" అని అడిగింది.

విమల బాగానే వుంది అన్నా, కామాక్షమ్మ ఊరుకోక ప్రశ్న మీద, ప్రశ్న వేసి తనకు కావలసిన విషయం రాబట్టింది.

విమల అత్తగారు కొంచెం కోపిష్టి మనిషి. కోడలు ఏం చేసినా ఆవిడకు నచ్చదు. ఇది విమలకు బాధకలిగించేది. అయినా, అత్తగారికి అనుకూలంగా ప్రవర్తించాలని, ఆమె చెప్పినట్లు చేసేది. అయినా, ఆమెకు సంతృప్తి కలిగేది కాదు. విమల భర్తతో తన కష్టం చెప్పుకుంటే, "అమ్మ చెప్పినట్లు నడుచుకో!" అని సలహా ఇచ్చేవాడే కాని, ఆమె బాధల విషయం పట్టించుకునేవాడు కాదు.

ఇది విన్న కామాక్షమ్మ, విమలతో, "అత్తవారింట ఆడపిల్ల గడుసుతనంతో వ్యవహరించాలేగాని, అణిగిమణిగి వుంటే ఇలాగే వుంటాయి పాట్లు!" అని పెద్దగా దీర్ఘం తీసింది.



కొంతసేపయ్యాక విమల వెళ్ళిపోయింది. అప్పుడు కామాక్షమ్మ, చందనతో, "నీ స్నేహితురాలు చెప్పింది విన్నావుగా! రేపు పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళాక, నీ అత్త చెప్పిన దానికల్లా గంగిరెద్దులా తలవూపకు. అత్తను అదుపులో పెట్టు. అప్పుడే నీ కాపురం సవ్యంగా వుంటుంది. అలాకానప్పుడు, నీ కాపురం విమల కాపురం లాగే తగలడుతుంది," అని చెప్పింది.

ఈ మాటలు చందన హృదయంలో హత్తుకున్నాయి.

చందన పెళ్ళి కేశవుడితో ఘనంగా జరిగింది. చందన అత్తగారు పార్వతమ్మ చాలా శాంత స్వభావురాలు. అందరితో మంచిగా మసలుకునేది. అయితే ఎదుటివాళ్ళు తప్పుచేస్తే మాత్రం ఆమె సహించేది కాదు.

చందన కాపరానికివచ్చిన రోజున చీకటి పడేవేళ పార్వతమ్మ వంటగదిలో వుండి, "చందనా! దీపం వెలిగించు," అని కేక వేసింది.

అయినా చందన దీపం వెలిగించలేదు. కొంచెంసేపు తర్వాత పార్వతమ్మ వంటగది నుంచి బయటికి వచ్చి, దీపం వెలిగించి, "ఏమ్మా, కేకవేసి చెప్పినా దీపం వెలిగించ లేదు. వినబడలేదా?" అని అడిగింది.

దానికి చందన, "మా ఇంట్లో మా అమ్మ నన్నేపనీ చేయనిచ్చేది కాదు," అన్నది.

ఆ మాటకు పార్వతమ్మ, "అది నీ పుట్టిల్లు. అక్కడ నువ్వు చిన్న పిల్లకిందలెక్క,





ఏం చేయకపోయినా ఫర్వాలేదు. కానీ ఇది నీ మెట్టినిల్లు. ఇక్కడ అంతా నువ్వే చూసుకోవాలి," అన్నది.

ఇది విని చందన, అత్త అప్పుడే ఇంటి పనంతా తననెత్తిన రుద్దాలని చూస్తున్నదని అనుకున్నది.

అప్పటి నుంచి అత్తాకోడళ్ళ మధ్య ప్రచ్ఛన్నయుద్ధం మొదలయింది. అత్త ఏం చెప్పినా, చందన ఎడ్డెమంటే తెడ్డెమనే రకంగా చేసేది. దానితో పార్వతమ్మ, చందనను గట్టిగా కోప్పడేది.

తల్లికీ, భార్యకూ పడకపోవడం కేశవుడు గమనించాడు. భార్య ప్రవర్తన తప్పని అతడికి తెలుసు. మందలించితే చందన అలిగేది. దానితో భార్యాభర్తల మధ్య స్పర్థలు మొదలయ్యాయి.

అటువంటి పరిస్థితులలో చందన స్నేహితురాలు విమల, తన స్నేహితురాలి అత్తింటి కాపురం ఎలా నడుస్తున్నదో చూసి పలకరించి పోదామని వచ్చింది.

చందన, ఆమెకు తనుకాపరానికి వచ్చిన రోజునుంచీ జరిగినదంతా దాచకుండా చెప్పి, "మా అత్త కారణంగా మా భార్యాభర్తల మధ్య గొడవలు మొదలయ్యాయి," అన్నది.

విమల ఎక్కడలేని ఆశ్చర్యంతో ముక్కు మీద వేలేసుకుని, "అయ్యో, చందనా, నువ్వెంత అమాయకురాలివే! నువ్వు చెప్పినదాన్ని బట్టి చూస్తూంటే, మీ అత్త వంటి ఉత్తమురాలు దొరకడం, నీ అదృష్టం. ఆమె పట్ల నువ్వే గయ్యాళిలా ప్రవర్తిస్తున్నావు," అన్నది.

"అంతేనంటావా?" అనిచందన కొంచెం ఆగి, "నా పెళ్ళికి ముందు నువ్వు మా ఇంటికి వచ్చావు, గుర్తుందా? చెప్పిన పనంతా సక్రమంగా చేస్తున్నా, మీ అత్త సాధిస్తూనే వుంటుందన్నావు. అది విన్న మా అమ్మ, నాకొక సలహా ఇచ్చింది. అత్త చెప్పిన దానికంతకూ గంగిరెద్దులా తల వూపవద్దనీ, ఆవిణ్ణి అదుపులో పెట్టాలనీ అన్నది. ఆ సూత్రం అమలు చేస్తున్నాను," అన్నది.

దీనికి విమల మరింతగా ఆశ్చర్యపోతూ, "మా అత్తకూ, మీ అత్తకూ పొంతనేలేదు. పుట్టింటి సంగతీ, మీ అమ్మ అనాలో చితంగా ఇచ్చిన సలహాలూ మరిచిపో. కోరి కాపురాన్ని ఒడిదుడుకులపాలు చేసుకోకు," అని కొంతసేపు స్నేహితురాలికి, అత్తింట ప్రవర్తించ వలసిన తీరు గురించి చెప్ప వలసినదంతా చెప్పింది.

చందన అంతా శ్రద్ధగా విని, "సరే, కొంతకాలం నీ సలహా కూడా పాటించి చూస్తాను," అన్నది.

మర్నాడు చందన ఉదయాన్నే లేచి స్నానం చేసి వంటగదిలోకి అడుగు పెట్టింది. ఏనాడూ లేనిది, కోడలు ఉద యాన్నే లేచి స్నానం చేసి వంట చేయ డానికి రావడం చూసి పార్వతమ్మ చాలా సంతోషించింది.

ఆ మర్నాడు, పార్వతమ్మ వాకిలి చిమ్మి, కళ్ళాపిచల్లిముగ్గువేయబోతుండగా చందన కల్పించుకుని,"ముగ్గునేనువేస్తాలేఅత్తయ్యా!" అని ముగ్గు వేసింది.

ఆ ఉదయం అంతా పార్వతమ్మ, వీధిన పోయేవాళ్ళతో, "చూడండర్రా! నా కోడలు ఎంత చక్కగా ముగ్గువేసిందో!" అని పిలిచి చెపుతూనే వుంది.

ఇది చూసిన చందనకు అత్తగారిపట్ల ఎంతో అభిమానం కలిగింది.

ఆ తర్వాత కొద్ది రోజులకు చందన గర్భవతి అయింది. అది తెలిసిన పార్వ తమ్మ చేసిన హడావుడి అంతా ఇంతా కాదు. చందనను మంచం మీదినుంచి కాలుకింద పెట్టనివ్వలేదు. తనే వంటచేసి, భోజనం పళ్ళెంలో పెట్టుకుని తీసుకు పోయి, చందనకు అందించేది.

చందన ఒకనాడు హాస్యమాడుతూ, "అత్తయ్యా! చూడబోతే, తినడం కష్టమని మీరే తినిపించేలా వున్నారే!" అన్నది.

ఆ మాటకు పార్వతమ్మ చిన్నగా నవ్వుకుని, "అవునే, చందనా! నీలాంటి మంచికోడలు దొరికితే, ఏ అత్త అయినా ఆ పని చేసి తీరుతుంది," అన్నది.



# హింసాప్రవృత్తి

విఘాతపురి రాజు వికటసేనుడు స్వతహాగా హింసాత్మక ప్రవృత్తి కలవాడు. యుద్ధాలు చేయడం, బందీలుగా పట్టుకున్న వారిని నరికిచంపడం, పూజలపేరిట అనేక మూగజీవులను బలులు పెట్టడం అతని అలవాట్లు.

మంత్రి ధర్మకీర్తి హితబోధలు వికటసేనుడి చెవికెక్కేవి కావు. యథారాజా తథాప్రజా - అన్న రీతిగా ప్రజల్లో కూడా హింసాప్రవృత్తి బాగా పెరిగి పోయింది.

ఇలా వుండగా, ఒకసారి మంత్రి ఆహ్వానం మీద సత్యానందుడనే ఒక గొప్ప సాధువు రాజును చూడవచ్చాడు. ఆయన పురాణాలు, ఉపనిషత్తులు, శృతులు, స్మృతులలోని అనేక విశేషాలను రాజుకు కథలుగా వివరిస్తూ అహింస ఎంత గొప్పదో, హింసను ఎందుకు పరిత్యజించాలో, చాలా ఆసక్తికరంగా వివరించాడు.

రాజువికటసేనుడు, సాధువుకు చేతులు జోడించి, "స్వామీ ! తమరు నాకు గురువులు. దక్షిణ ఏమిచ్చుకోవాలో ఆజ్ఞాపించండి," అన్నాడు.

సాధువు చిరునవ్వు నవ్వి, "రాజా!నీరాజ్యంలో హింస తాండవిస్తున్నది. నువ్వూ, నీరాజ్య ప్రజలూ హింసను విడనాడండి. అదే నాకు ఇవ్వదగ్గ గురుదక్షిణ," అన్నాడు.

"అవశ్యం!" అంటూ వికటసేనుడు వెంటనే సేనాధిపతిని పిలిపించి, "సేనాపతీ! రాజ్యంలో నేటి నుంచి అంతా అహింస పాటించి తీరాలి. అలా అని వెంటనే చాటింపు వేయించండి. ప్రజల్లో ఎవరైనా అహింసను పాటించకపోతే, వాళ్ళను అక్కడికక్కడే నిర్దాక్షిణ్యంగా నరికి వేయండి ! ఇదే మా ఆజ్ఞ," అన్నాడు.

మంత్రి ధర్మకీర్తికీ, సాధువు సత్యానందుడికీ ఏమనాలో తోచలేదు. —వక్కలంక 'కిషోర్'






[రాజు ప్రతాపవర్మకూ, యువరాణి ప్రియంవదకూ రాజగురువు గౌరీనాధుడు విచిత్రపుష్పం 'శతాబ్దిక' శాపకారణం గురించిన విషయాన్ని తెలియజేశాడు. మాణిక్యపురి దక్షిణ ప్రాంతంలో సముద్రతీర గ్రామాలలోని కొన్ని ఇళ్ళు హఠాత్తుగా నేలమట్టమై పోయాయనీ, ప్రజలు భయభ్రాంతులై ఇల్లూ, వాకిలీ వదిలి పారి పోతున్నారనీ సేనాధిపతి గంభీరసింహుడు రాజుకు చెప్పాడు. — తరవాత]

సముద్ర తీరంలోని గ్రామాలు నేలమట్టమై పోవడానికి కారణం ఫలానా అని తెలియదు. అసలు ఏం జరిగిందో ఎవరికీ అంతుబట్ట లేదు. ఆ రాత్రంతా ఎప్పటిలాగే ప్రశాంతంగా గడిచింది. వర్షం కురియడం గాని సముద్ర కెరటాలు పొంగడం గాని జరగలేదు. తెల్లవారి లేచి చూసే సరికి చిన్నా పెద్ద ఇళ్ళన్నీ నేలమట్టమై కనిపించాయి. ఏం జరిగిందో అని తలకొక విధంగా ఊహించు కుంటూ, అక్కడ ఉంటే తమ ప్రాణాలకే ముప్పు వాటిల్ల గలదన్న భయంతో గ్రామ ప్రజలు చెట్టు కొకరు పుట్ట కొకరుగా పరు గులు తీశారు.

అలా పారిపోయి వచ్చిన వారు కొందరు రాజధానీనగరం చేరారు. నగర సింహ ద్వారం వద్ద ఉన్న కాపలా భటులు, ఈ విషయాన్ని సేనాధిపతికి తెలియజేశారు. సేనాధిపతి ఆజ్ఞానుసారం వాళ్ళను సైని



కులు ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన శిబిరాలకు తీసుకు వెళ్ళారు. శరణార్థులు కొందరు ఆలయ ప్రాంగణాల లోనూ, మరికొందరు వసంతోత్సవాలు జరిగిన మైదానంలోనూ ఆ రాత్రి గడిపారు.

యువరాణి ప్రియంవద, తన చెలికత్తెలతో కలిసి, రాజప్రాసాదంలో ఏభాగాన్ని శరణార్థులయిన స్త్రీలకూ, పిల్లలకూ కేటాయిస్తే బావుంటుందో పరిశీలించి, ఆ భాగాన్ని ఖాళీ చేయించి సిద్ధం చేయించే సరికి అర్ధరాత్రి దాటింది.

తెల్లవారగానే రాజు ప్రతాపవర్మ, సేనాధిపతి గంభీరసింహుడితో కలిసి, శరణార్థులుగా వచ్చిన ప్రజలను పరామర్శించడానికి వెళ్ళాడు. రాజును చూడగానే ప్రజలు, "ఇల్లూ, వాకిలీ, గొడ్డూ గోదా అంతా వదిలి కట్టుబట్టలతో పారిపోయి వచ్చాము, మహారాజా! తిరిగి వెళ్ళాలన్నా భయంగా ఉన్నది. తిరిగి వెళ్ళినా, మా ఇళ్ళన్నీ నాశనం కాకుండా ఉంటాయన్న నమ్మకం లేదు. ఏ నిమిషాన ఎటువంటి ఆపద ముంచుకు వస్తుందో తెలియదు", అన్నారు దీనంగా.

"మీకు రక్షణ కల్పించే బాధ్యత నాది. మీ ప్రాణాలకు గానీ, ఆస్తిపాస్తులకు గానీ ఎటువంటి హానీ రాదు. మీరు నిశ్చింతగా ఉండండి!" అని రాజు వాళ్ళను ఆప్యాయంగా ఓదార్చి, సేనాధిపతి గంభీరసింహుడి కేసి చూశాడు.

"నిన్ననే మన సైనికులు కొందరిని దక్షిణ ప్రాంతానికి పంపాను. ఎటువంటి ఆపద వచ్చినా ఎదుర్కోవడానికి వాళ్ళు సిద్ధంగా వెళ్ళారు. గ్రామస్థులు వదిలి వచ్చిన ఇళ్ళనూ, ఆస్తిపాస్తులనూ చెక్కు చెదర కుండా రక్షించే బాధ్యత కూడా మన సైనికులకు అప్పగించాను. వంతుల వారీగా, అంటే – ఉదయం నుంచి సాయంకాలం వరకు కొందరినీ, సాయంకాలం నుంచి తెల్లవారేదాకా మరికొందరినీ కాపలా ఉంచడానికి ఏర్పాట్లు చేశాను, ప్రభూ! అందుకు కావలసినంత మంది సైనికులను పంపాను. కాబట్టి వీళ్ళు తమ ఇళ్ళ భద్రత

గురించి బెంగపడవలసిన అవసరం ఏమీ లేదు," అన్నాడు సేనాధిపతి.

"అలాగా!" అన్నాడు రాజు సంతోషంగా.

"మరొక శుభవార్త, ప్రభూ! శరణార్థులుగా వచ్చినస్త్రీలకోసం,పిల్లలకోసం,యువ రాణి రాజప్రాసాదం లోని పడమటి దిశ భాగాలను కేటాయించారు.స్వయంగాఅక్కడి ఏర్పాట్లన్నీ చూసి, యువరాణి నిద్ర పోవటానికి అర్ధరాత్రి దాటిందని పరిచారికలు నాకు తెలియజేశారు," అన్నాడు సేనాధిపతి.

"పేదలకు సాయ పడాలనే పరోపకార బుద్ధి ప్రియంవదకు బాల్యం నుంచే ఉన్నది. సరే అక్కడి ఏర్పాట్లు ఎలా ఉన్నవో వెళ్ళి చూద్దాం," అన్నాడు రాజు ఎంతో ఉత్సాహంగా.

"చిత్తం, ప్రభూ!" అని సేనాధిపతి రాజు వెంట నడిచాడు.

రాజూ, సేనాధిపతీ రాజప్రాసాదం పడమటి భాగాన్ని చేరే సరికి, అక్కడ స్త్రీలూ, పిల్లలూ వరుసలు వరుసలుగా కూర్చుని ఉన్నారు. వాళ్ళ ముందు ఆకులు పరచి ఉన్నాయి. కొంతసేపటికి, యువ రాణి ప్రియంవద వెంట వచ్చిన పరిచారికలు పాత్రలలో తెచ్చిన భోజనం అందరికీ వడ్డించారు. అందరూ చాలా సంతోషంగా భోజనం చేస్తున్న దృశ్యం చూసిన రాజు పరమానందం చెంది, "ప్రియంవదా, నీ ఔదార్యం మెచ్చుకో తగినది. బాధలలో ఉన్నవాళ్ళను ఆదుకోవడం లోనే మానవ జన్మకు సార్థక్యం లభిస్తుంది. ఆవిషయం





గ్రహించిన నిన్ను చూస్తుంటే నాకెంతో ఆనందంగా ఉన్నది. నిన్ను కన్నందుకు నేనెంతో గర్వపడుతున్నాను. ఈ పేద ప్రజలు నీమేలును చిరకాలం గుర్తుంచుకుంటారు. వీళ్ళు ఇక్కడ ఉన్నంత వరకు ఇప్పటి లాగే వాళ్ళ అవసరాలన్నీ చూసే ముఖ్యమైన బాధ్యత నీకు అప్పగిస్తున్నాను," అన్నాడు.

యువరాణి సరే అన్నట్టు చిరునవ్వుతో తల ఊపుతూ, "మీకు ఇక్కడి విచారమేమీ వద్దు, నాన్నా! ఇక్కడి వాళ్ళకు ఎటువంటి కొరతా లేకుండా చూసుకునే బాధ్యత నాది. మిగతా చోట్ల ఉన్న శరణార్థులను గురించి మీరు ఆలోచించండి," అన్నది వినయంగా.

రాజూ, సేనాధిపతీ అక్కడి నుంచి బయలుదేరి రాజప్రాసాదం ప్రధాన భవనం సమీపిస్తూండగా, నలుగురు సైనికులు ఎదురు పడ్డారు. వాళ్ళెందుకో ఆందోళన చెందుతున్నట్టు కనిపించారు.

"ఏమిటి అలా ఉన్నారు? ఏం జరిగింది?" అని అడిగాడు సేనాధిపతి.

"నిన్న దక్షిణ ప్రాంతాలకు వెళ్ళిన మన సైనికుల జాడ కనిపించడం లేదు, ప్రభూ!" అన్నారు సైనికులు.

"ఏమయ్యారు?" అని అడిగాడు సేనాధిపతి కోపంగా.

"ఆ సంగతి చెప్పడానికి కూడా అక్కడెవరూ లేరు. ఈ రోజు ఉదయం మన సైనికులు అక్కడికి చేరేసరికి, ఆ ప్రాంతమంతా నిర్మానుష్యంగా ఉన్నది. మరికొన్ని గ్రామాలు నేలమట్టమై ఉన్నాయి," అన్నారు సైనికులు.

"ఉదయం వెళ్ళిన సైనికులు తిరిగి వచ్చారా? అక్కడే ఉన్నారా?" అని అడిగాడు సేనాధిపతి.

"ముగ్గురు సైనికులు వచ్చి, ఆ విషయం తెలియజేసి, వెంటనే తిరిగి వెళ్ళిపోయారు. వాళ్ళ వెంట మన దళనాయకుడు వీరసింహుడు కూడా వెళ్ళారు," అన్నారు సైనికులు.

"అలాగా, వీరసింహుడు రాగానే నన్ను చూడమని చెప్పండి," అన్నాడు సేనాధిపతి.

"చిత్తం, ప్రభూ !" అని సైనికులు వెళ్ళి పోయారు.

"మరిన్ని ఇళ్ళు నేలమట్టమయ్యాయని తెలిస్తే, ఇక్కడున్న వాళ్ళు మరింత హడలి పోగలరు. ఆవిషయాన్ని మనమధ్యే ఉంచు దాం. సముద్ర తీరానికి వెళ్ళిన దళ నాయకుడు తిరిగి రాగానే, బహుశా మన సైన్యాన్నిఅక్కడికి నడిపించవలసి రావచ్చు. కాబట్టి సైన్యాన్ని సిద్ధంగా ఉంచడం అవ సరం?" అన్నాడు రాజు.

"అలాగే చేద్దాం ప్రభూ. దళ నాయ కుడు రాగానే మీ దగ్గరికి వస్తాను," అని చెప్పి సేనాధిపతి బయలుదేరాడు.

సైనికులతో పాటు సముద్ర తీరానికి వెళ్ళిన దళనాయకుడు, ఆ రోజు సాయం కాలానికి హడావుడిగా తిరిగి వచ్చి, సేనాధి పతికి నమస్కరించాడు.

"ఏమిటలా బిక్కమొహంతో ఉన్నావు? అసలు అక్కడ ఏంజరిగిందో తెలుసుకుని వచ్చావా?" అని అడిగాడు సేనాధిపతి.

"అంతా వింతగా ఉన్నది, ప్రభూ ! నిన్న వెళ్ళిన మన సైనికులు సముద్రతీరం చేరుకున్నారనడంలో సందేహం లేదు. ఎందుకంటే వారి అడుగుజాడలు స్పష్టంగా కనిపించాయి. వాళ్ళు అక్కడ చేరుకున్న తరవాత ఏంజరిగిందో తెలియ లేదు. చెప్ప డానికి అక్కడ ఒక పిట్ట కూడా లేదు," అన్నాడు దళనాయకుడు.

"ఇప్పుడేం చేద్దామని నీ ఉద్దేశం?" అని అడిగాడు సేనాధిపతి.





"శభాష్ ! అలాగే చెయ్యి", అని చెప్పి సేనాధిపతి రాజభవనానికి వెళ్ళి, రాజుకు విషయం తెలియజేసి, అక్కడి నుంచి శరణార్థుల శిబిరాలకు వెళ్ళాడు. అక్కడ వచ్చిన వాళ్ళకందరికీ కూడా ఆహారపానీయాలకు గానీ, విశ్రాంతి తీసుకోవడానికి గానీ ఎటువంటి ఇబ్బందులూ కలగ లేదు. రాజభటులే కాకుండా నగర ప్రజలు కూడా వాళ్ళకు సాయపడడం చూసి సేనాధిపతి ఎంతో సంతోషించాడు.

మరునాడు తెల్లవారుతూ ఉండగా, దళనాయకుడు వీరసింహుడు సేనాధిపతి ఇంటికి వచ్చాడు. అతన్ని చూడగానే సేనాధిపతి, "అప్పుడే వెళ్ళి వచ్చావా? ఎలా ఉన్నది పరిస్థితి?" అని అడిగాడు.

"సముద్రతీరంలోని సైనికులందరూ ఒకేచోట ఉండకుండా వాళ్ళను మూడు జట్లుగా విడ దీశాను. మొదటి జట్టు సముద్ర తీరంలో ఉంటుంది. రెండవ జట్టు వాళ్ళకు కూతవేటు దూరంలో ఉంటుంది. మూడవ జట్టు ఇంకా ఇవతల ఉంటుంది. మూడు జట్లకూ మధ్య సమాచారం అందుతూనే ఉండే విధంగా అప్రమత్తంగా ఉండమని ఆజ్ఞాపించి వచ్చాను. తమరు అనుమతించినట్టయితే తెల్లవారగానే నేను ఒకసారి స్వయంగా అక్కడికి వెళ్ళి, సమాచారం తెలుసుకుని వచ్చి మీకు తెలియజేస్తాను," అన్నాడు దళనాయకుడు.

"చాలా భయానకంగా ఉన్నది, ప్రభూ ! నేను బయలుదేరుతూ ఉండగా అక్కడి సైనికులు కొందరు వచ్చి చెప్పారు. ఆ రాకాసిమృగం మళ్ళీ వచ్చిందట!" అన్నాడు దళనాయకుడు.

"రాకాసిమృగమా!" అన్నాడు సేనాధిపతి అమితాశ్చర్యంతో.

"అవును ప్రభూ! సరిగ్గా అర్ధరాత్రి సమయంలో సముద్రంనుంచి పర్వతాకారంలో ఒక రాకాసిమృగం పైకిరావడం సైనికులకు కనిపించిందట. అది నేల మీద నడుస్తున్నదో లేక గాలిలో అలా తేలుతున్నదో తెలియలేదట! అయితే, అది

తన తలను అటూ ఇటూ ఆడిస్తూ మెల్లగా కదులుతున్న కొద్దీ దాని కాళ్ళకింద ఇళ్ళూ, ఇళ్ళల్లోని మనుషులూ, చెట్లూ సర్వం అలాగే భూమిలోకి దిగిపోయాయట. అయితే, అది ఏమాత్రం శబ్దం చేయకుండా భీకరమైన తలను అటూ ఇటూ ఆడిస్తూ ఉత్తర దిశగా కదిలి పోయిందట. సముద్ర తీరంలో ఉన్న మన సైనికులు దాని పాదాల కిందపడి అలా నేలలోకి కూరుకు పోయారట. వాళ్ళకు కొంత దూరంలో నిలబడిన మిగతా సైనికులు ఆ ప్రాణిని వెనకనుంచే చూశారు గాని, దాని ముఖం చూడ లేదు. అక్కడి నుంచి భయభ్రాంతులై పారిపోయి వచ్చారు," అన్నాడు దళనాయకుడు.

"అది ఎలాంటి రాకాసిమృగమై ఉంటుంది? అది ఉత్తర దిశగా ఎందుకు వెళ్ళింది?" అన్నాడు సేనాధిపతి మనసులో అనుకుంటున్నట్టు.

"అవును ప్రభూ! మన సైనికులు దానిని ఎదుర్కొని వుంటే వాళ్ళు కూడా దాని పాదాల కింద పడి భూమిలోకి కూరుకు పోయి ఉండేవాళ్ళు ! వాళ్ళు భయపడి తిరిగి రావడం వల్లే దాని విషయం మనకు తెలిసింది," అన్నాడు దళనాయకుడు నెమ్మదిగా!

సేనాధిపతి కొంతసేపు మౌనంగా ఆలోచించి, "సరే, అది ఉత్తర దిశగా వెళ్ళిందంటున్నావు. అది సముద్రంనుంచి రావడం వల్ల తెల్లవారేలోగా మళ్ళీ సముద్రం చేరి ఉంటుందనే భావిస్తున్నాను. ఉత్తర దిశకు మన సైనికులు కొందరిని పంపు. అక్కడ ఏదైనా ప్రమాదం వాటిల్లి ఉండవచ్చు. దక్షిణ సముద్ర తీరంలో కాపలాను యధా ప్రకారం కొనసాగించు. నిన్న రాత్రి లాగే సైనికులను మూడు జట్లుగా విడదీసి కాపలాఉంచు. ఆ రాకాసిమృగం గురించి మరేదైనా విషయాలు తెలిస్తే వెంటనే వచ్చి చెప్పు. నేనీవిషయం రాజుకు చెప్పివస్తాను. ఈ అపాయం నుంచి ప్రజలను కాపాడవలసిన బాధ్యత మనకున్నది," అన్నాడు సేనాధిపతి. —(ఇంకావుంది)






# నిజమైన మిత్రుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రి వేళ అంతఃపురంలో హాయిగా నిద్రపోతూండ వలసిన నువ్వు, ఎన్నిసార్లు ప్రయత్నం విఫలమైనా పట్టుదల వీడక పోవడాన్ని వివేకమనుకోవాలో, మూర్ఖత్వమనుకోవాలో తెలియడం లేదు. చాలామంది వ్యక్తులు, తమ వర్తమాన స్థితిగతుల పట్ల అసంతృప్తులైనా, వాటి నుంచి బయటపడేందుకు అవసరం అయిన శక్తి సామర్థ్యాలు తమకు లేవని, సాహసించక నిరాశలో కాలం వెళ్ళబుచ్చుతుంటారు. మరికొందరు సాహసించి కూడా, తమ లక్ష్యసిద్ధికి సాయపడే నిజమైన మిత్రులెవరో గుర్తించలేక తప్పటడుగులు వేస్తారు. నువ్వు కూడా ఇలాంటి వారి

## బేతాళ కథలు



కోవకు చెందిన వాడివేమో అన్న అనుమానం కలుగుతున్నది. ఏది ఏమైనా— నీకు కేవలం హెచ్చరిక గానే కాక, మార్గ నిర్దేశికంగాకూడాఉంటుందన్ననమ్మకంతో, రామనాధుడనే అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

రామనాధుడనే ఒక చిన్న వ్యాపారి భార్య సీతకు, పట్నవాసం చెయ్యాలని కోరిక. రామనాధుడికి చాలా విద్యలు వచ్చు. అతడు చక్కగా పాడతాడు, అందంగా చిత్రాలు వేస్తాడు. ఇలాంటి వ్యాపారానికి సంబంధించని సరదాలకు తోడు, అతడికి మొహమాటం ఎక్కువ. ఊళ్ళో అందరూ బాగా తెలిసినవారు కావడంవల్ల, దుకాణంలో కొన్న సరుకులకు ఇచ్చిన వాళ్ళు ఇచ్చినంత ఇస్తారు, లేనివాళ్ళు లేదు. అందువల్ల, రామనాధుడికి భుక్తికి లోటు లేకపోయినా వ్యాపారం ఎటువంటి ఎదుగూ బొదుగూ లేకుండా అంతంత మాత్రంగా వుంటున్నది.

పట్నంలో అయితే తెలిసినవాళ్ళు తక్కువ కాబట్టి మొహమాటాలుండవు. అలాంటి చోట పాటకూ, చిత్రాలకూ కూడా బాగా డబ్బు వస్తుంది. ఇలా చెప్పి భార్య పోరగా, పోరగా చివరకు రామనాధుడు ఒప్పుకుని, ఊళ్ళో తనకున్నవన్నీ అమ్మేసి, ఒక రెండెడ్ల బండిమీద పట్నం బయల్దేరాడు.

కొంతదూరం వెళ్ళాక వాళ్ళ బండి ఇరుసు విరిగిపోయింది. బండి నడకలో తేడా కనిపెట్టిన బండివాడు, భార్యాభర్తలను వెంటనే దిగమని ప్రమాదం నుంచి వాళ్ళను కాపాడాడు.

ఇప్పుడేం చేయాలా అని వాళ్ళు ఆలోచిస్తూండగా, రెండెడ్ల బండి ఒకటి వారికెదురుగా వచ్చింది. బండివాడు ఆ బండిని ఆపి అందులోని వారిని సాయమడిగాడు.

బండిలోంచి ఒక మీసాల వ్యక్తి దిగి, "అడ్డమైన వాళ్ళందరికీ నేను సాయపడలేను. ఎరిగున్నవాళ్ళకు మాత్రమే సాయం చేస్తాను. కాబట్టి నీకూ, నాకూ పరిచ

యమేదైనా వుందేమో చెప్పు?" అంటూ రామనాధుడి వద్దకు వచ్చాడు.

రామనాధుడికి ఆ మనిషిని ఎక్కడో చూశాననిపించింది. ఇద్దరూ పరస్పరం పరిచయాలు చేసుకున్న వెంటనే, ఒకరినొకరు కౌగలించుకున్నారు. ఆ మీసాల వ్యక్తి రామనాధుడికి చిన్నతనంలో ప్రాణస్నేహితుడైన సత్యానందుడు. ఇప్పుడతడు పట్నంలో ఉంటున్నాడు.



సత్యానందుడు, రామనాధుడి బండి మరమ్మతుకు సాయపడడమేగాక, "నేనిప్పుడు అవసరం అయిన పని మీద వెళుతున్నాను. నా ఇంటి వివరాలు చెబుతాను. మీరు నేను వచ్చే వరకూ అక్కడే వుండాలి. నేను తిరిగి రావడానికి రెండు మాసాలు పట్టవచ్చు. అయినా, మీరు వేరే చోట వుండడానికి వీల్లేదు. నేను తిరిగి రాగానే మీకు స్థిరపడే ఏర్పాట్లు చేస్తాను," అని చెప్పి ముందుకు వెళ్ళిపోయాడు.

సీత ఎంతో సంతోషించి, "ఇంత మంచి మిత్రుడు పట్నంలో ఉన్నట్టు, నాకేనాడూ చెప్పలేదేం?" అని భర్త నడిగింది.

"నాకు పధ్నాలుగేళ్ళ వయసు వచ్చే వరకూ సత్యానందుడు, ధనశేఖరుడు అనే వాళ్ళు నా ప్రాణస్నేహితులు. నేను గీసే బొమ్మలు వాళ్ళకెంతో నచ్చేవి. నాచేత వాళ్ళు బొమ్మలు గీయించుకునేవారు. పాటలు పాడించుకునేవారు. పల్లెటూరి పొలాల గురించి నేను పాడే పాటలు వాళ్ళకెంతో ఇష్టం. తర్వాత తల్లిదండ్రులు పల్లె విడిచి పెట్టడంతో సత్యానందుడు, ధనశేఖరుడు వెళ్ళిపోయారు. ఆ తర్వాత సత్యానందుడిని ఇదే కలుసుకోవడం," అన్నాడు రామనాధుడు.

"అయితే, ధనశేఖరుడు కూడా పట్నంలోనే వున్నాడా?" అని అడిగింది సీత కుతూహలంగా.

"నువ్వినలేదా? ధనశేఖరుడి గురించి అడిగితే సత్యానందుడు అయిష్టంగా బదులిచ్చాడు. పెద్దయ్యాక ధనశేఖరుడు మారిపోయాడనీ, వాడి గురించి వివరాలడగొద్దనీ అన్నాడు," అని చెప్పాడు రామనాధుడు.



బండివాడు తిరిగొచ్చి రామనాధుడికి జరిగింది చెప్పాడు. రామనాధుడు, ఆ ధనశేఖరు డెవరో చూద్దామని వెళితే, అతడు తన చిన్ననాటి స్నేహితుడు! ఇద్దరూ ఒకరినొకరు గుర్తు పట్టి సంతోషంగా కౌగలించుకున్నారు. మాటల సందర్భంలో సత్యానందుడి ప్రసక్తి రాగా, "వాడూ ఈ పట్నంలోనే ఉంటున్నాడు. మంచి పలుకుబడి సంపాయించినా, నాలాగా డబ్బు గడించలేదు. అందువల్ల వాడికి, నేనంటే అసూయ," అన్నాడు ధనశేఖరుడు.

ఆ సమయంలో ధనశేఖరుడు ఒక ముఖ్యమైన పని మీద దూరప్రాంతం వెళుతున్నాడు. కానీ చిన్ననాటి స్నేహితుణ్ణి కలుసుకున్న ఆనందంలో అతడా పనిని వాయిదా వేసుకోదలిచి, అంతవరకూ కింద నిలబడి మాట్లాడుతున్న మనిషితో, "నరసింహం! నేను బలభద్రుడికి నా ప్రయాణం వాయిదా వేసుకున్న విషయం చెప్పి వస్తాను. నువ్వు వీళ్ళకు మనిల్లు చూపించు," అన్నాడు.

ధనశేఖరుడి బండి వెనుదిరిగింది. రామనాధుడి బండి, ఆ బండి వెనకే నడిచింది. ఇరుకు సందు దాటిన తర్వాత రెండు బళ్ళూ చెరొక దారిలో వెళ్ళాయి.

కొంత దూరం పోయాక రామనాధుడు, భార్యతో, "సత్యానందుడు అంత అభిమానంగా తన ఇంటికి వెళ్ళమని చెప్పాడు.

తర్వాత వాళ్ళ బండి రెండు రోజులు ప్రయాణం చేశాక, పట్నం పొలిమేరల్లోని ఒక ఇరుకు సందును చేరుకున్నది. అక్కడ బళ్ళు ఎదురెదురుగా సాగలేవు. ఒక బండి దారికి అడ్డంగా ఆగి వున్నది. బండిలోని మనిషి ఒకడు కింద నిలబడ్డవాడితో అదే పనిగా మాట్లాడుతున్నాడు. ఇది చూసి రామనాధుడు తన బండివాడిని పంపాడు.

బండివాడు, ఎదుటి బండివాడితో సంగతి చెప్పగా, వాడు, "ఇది ధనశేఖరుడి గారి బండి. ఎంతసేపాగినా ప్రశ్నించడానికి లేదు. నీకంత అవసరమైన పనుంటే, ఆ పక్కన చుట్టుదారి వుంది, వెళ్ళు," అన్నాడు కోపంగా.

ముందు వాడింటికే వెళదాం," అన్నాడు సంతోషంగా.

అందుకు సీత, "చాల్లెండి! ఆయన పని మీద పోతూ కనిపించావు గదా అని, తన ఇంటికి వెళ్ళమన్నాడు. నీ కోసం ఉన్న పని మానుకుని తిరిగి వస్తున్నాడు ధనశేఖరుడు. మనం ధనశేఖరుడింటికే వెళదాం," అన్నది.

రామనాధుడు ఇంకేమీ అనలేక ఊరుకున్నాడు.

నరసింహం వాళ్ళకు ధనశేఖరుడిల్లు చూపించి, "ఆయన మీకు ఇల్లు చూపించమన్నాడే తప్ప లోపలికి తీసుకువెళ్ళమనలేదు. చెప్పిందానికి అదనంగా ఏం చేసినా ఆయనతో మాట వస్తుంది," అని వెళ్ళిపోయాడు.

అతడి ప్రవర్తనకు ఆశ్చర్య పడుతూనే రామనాధుడు, భార్యను వెంట బెట్టుకుని ఇంద్రభవనంలా వున్న ఆ ఇంటి ఆవరణలో అడుగుపెట్టాడు. ఇంటి గుమ్మం వద్ద కాపలావాడు, వాళ్ళ వివరాలడిగి తెలుసుకుని లోపలికి వెళ్ళాడు.

కొద్దిసేపటి తర్వాత ధనశేఖరుడి భార్య కామాక్షి బయటికి వచ్చి, "అయ్యా! మీరెవరో నాకు తెలియదు. పట్నంలో మావారికున్న పేరు అంతాయింతా కాదు. అందువల్ల స్నేహితులమంటూ మా ఇంటికెందరో వచ్చి పోతూంటారు. అలాంటి వారిలో కొందరు అదును చూసుకొని దొంగతనాలు



చేశారు. కనక మీరు వారింటికి వచ్చేదాకా బయటనే వుండాలని కోరుతున్నాను. మీరు వారి స్నేహితులే అయితే, నా తప్పుకు క్షమాపణ చెప్పుకుంటాను. అన్యథా భావించకండి," అన్నది.

రామనాధుడికి తల తీసేసినట్లయింది. ఆయన కామాక్షితో, "అమ్మా! మీ వారు మరీ మరీ చెప్పడంవల్ల ఇలా వచ్చాను. లేకపోతే నా మిత్రుడు సత్యానందుడింటికే సరాసరి వెళ్ళి వుండేవాణ్ణి," అన్నాడు.

ఆ జవాబు విని కామాక్షి ఆశ్చర్యపడి, "సత్యానందుడి మిత్రులెవరూ మా వారికి మిత్రులు కాలేరు. ఆ ఇంటి మీద కాకి, ఈ ఇంటి మీద వాలదని తెలియక మీరు



వెళ్ళారు. పూటకూళ్ళ ముసలావిడ వాళ్ళ వివరాలడిగి తెలుసుకుని, "అయితే మీది సత్యానందుడి ఊరన్నమాట. మీరిక్కడ వుండడానికి వీల్లేదు," అన్నది.

రామనాధుడు కోపంగా, "సత్యానందుడి ఊరి వాళ్ళకీ పట్నంలో పూటకూళ్ళింట్లో కూడా చోటుండదా?" అని అడిగాడు.

దానికి ముసలావిడ, "బాబూ! నా ఉద్దేశమది కాదు. సత్యానందుడెంతో మంచి వాడు. నేను కష్టాల్లో వున్నప్పుడాబాబు ఆదుకోకపోతే, నేనేమైపోయే దాన్నో! తన ఊరి వాళ్ళెవరొచ్చినా తన ఇంట్లోనే వుండాలి తప్ప, పూటకూళ్ళ ఇళ్ళల్లో వుండకూడదని అంటాడాబాబు. ఇప్పుడు తమరు నా ఇంట్లో వుంటే తర్వాత ఆ బాబు నన్ను క్షమించడు!" అంటూ రామనాధుడు వారిస్తున్నా వినకుండా, ఒకమనిషి చేత సత్యానందుడింటికి కబురు పంపింది.

కాసేపటికి సత్యానందుడి భార్య జలజ అక్కడికి వచ్చి, "అయ్యో, రామనాధం అన్నయ్యా! నీ గురించి, నా భర్త చెప్పగా ఎన్నో విన్నాను. పల్లెటూరి పొలాల గురించి నువ్వు పాడే పాటలు, ఆయన రోజూ తలచుకుంటారు. చిన్నప్పుడు నువ్వు గీసిన బొమ్మలు చాలా దాచుకున్నాడాయన. నిన్ను చూడాలని ఎంతకాలం నుంచో అనుకుంటున్నాను. నీ కుడిబుగ్గ మీద మచ్చకు కారణం ఆయన కొట్టిన దెబ్బట! అవునా? అది

అబద్ధం చెబుతున్నారని నాకు తోస్తున్నది," అన్నది.

రామనాధుడు క్షణం కూడా ఆగకుండా, భార్యను తీసుకుని బయటికి వచ్చాడు. జరిగిన అవమానానికి భార్యే కారణమని అతడన్నాడు. దానికి సీత చిరాగ్గా, "చాల్లెండి! నీ స్నేహితులు మా మంచి వాళ్ళు. నేను చెడ్డదాన్ని. పట్నంలో వున్న వాడి విషయమే ఇలా వుంటే, ఇక లేని వాడింటికి వెళితే ఇంకా ఎంత అవమానం పాలు కావలసివస్తుందో! పద, ఏ పూట కూళ్ళ ఇంట్లోనైనా వుందాం," అన్నది.

రామనాధుడికి భార్య మాటలు సబబుగా తోచాయి. వాళ్ళు ఒక పూటకూళ్ళ ఇంటికి

తలచుకుని ఇప్పటికీ బాధపడతాడాయన. నువ్విక్కడున్నావేమిటి? మీరిద్దరూ మా ఇంటికి రావలసిందే!" అన్నది.

రామనాధుడు, సీత సత్యానందుడింటికి వెళ్ళక తప్పలేదు. కొంతసేపటికి రామనాధుడిని తనింటికి రావలసిందిగా ధనశేఖరుడు, నరసింహం ద్వారా కబురంపాడు. రామనాధుడు వెళ్ళాడు.

ధనశేఖరుడుజరిగిందానికిబాధపడుతూ, "రామనాధా! నాకూ, ఆ సత్యానందుడికీ బద్ధవైరం. అందువల్లనే నేను స్వయంగా వాళ్ళింటికి రాలేకపోయాను. నేను బలభద్రుడింట్లో కాస్త ఎక్కువ సేపే వుండిపోవలసి వచ్చింది– చాలా అవసరం అయిన పని వాయిదా వేయవలసి వచ్చింది గదా! నేను ఇంటికి వచ్చాక జరిగింది తెలిసింది. ఎంతో బాధ పడ్డాను. కొన్నాళ్ళు పోతే, ఇందులో మా తప్పేం లేదని నువ్వూ తెలుసుకుంటావు. పట్నం పరిస్థితులలాగున్నాయి! ఏది ఏమైనా నేనూ, నా భార్యా మన్నించమని వేడుకుంటున్నాం. నువ్వు సతీసమేతంగా మా ఇంటికి వచ్చి వుండాలి. నేను డబ్బు సంపాయించే మార్గాలన్నీ నీకు నేర్పి, నిన్ను నా అంతటి వాణ్ణి చేస్తాను," అన్నాడు.

"నీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి! కానీ నేను సత్యానందుడింట్లోనే వుంటాను," అన్నాడు రామనాధుడు.



ధనశేఖరుడు శతవిధాల బ్రతిమాలాడు. చివరకు సత్యానందుడితో కలిస్తే, తనతో విరోధం రాగలదని బెదిరించాడు. రామనాధుడు దేనికీ చలించకుండా సత్యానందుడింటికి తిరిగి వెళ్ళాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ధనశేఖరుడు చెప్పిన దాన్ని బట్టి, అతడు కావాలని రామనాధుణ్ణి అవమానించలేదని తెలుస్తూనే వున్నది గదా! అంత గొప్ప సంపన్నుడు రామనాధుణ్ణి క్షమించమని కోరడం ఎంతో ఉదాత్తమైన విషయం. రామనాధుడు, ధనశేఖరుడు కోరినట్టు అతడి ఇంట వుంటే, అతడి సాయంతో లక్షలార్జించకలిగేవాడు. అతడు పట్నం వచ్చిన

లక్ష్యం సిద్ధించేది. కాని, అతడు తనకు నిజమైన మిత్రులెవరో గుర్తించలేక, వచ్చిన మంచి అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకోవడం మూర్ఖత్వమే గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పల్లెలో కంటే పట్నంలో తన సమర్థత ఎక్కువగా రాణించ గలదని, రామనాధుడు పల్లె విడిచి పట్నం బయల్దేరాడు. అతడికి ముందుగా పట్నంలో తన మిత్రులిద్దరూ ఛాలా ప్రముఖ వ్యక్తులన్న సంగతి తెలియనే తెలియదు. అంటే-రామనాధుడు తన స్వశక్తిని నమ్ముకుని పల్లె విడిచాడన్నమాట! మార్గమధ్యంలో ఒకరి తర్వాత ఒకరుగా మిత్రులు తారసపడడం అంతా కాకతాళీయం. ఇక సత్యానందుడూ, ధనశేఖర్లలో రామనాధుడికి ఎవరు నిజమైన మిత్రులన్న సంగతి: ధనశేఖరుడికి, రామనాధుడిపట్ల స్నేహభావమున్నమాట నిజమే! కాని అది అతణ్ణి చూసినప్పుడే ధనశేఖరుడికి స్ఫురిస్తుంది. అతడు తన భార్యకు ఏనాడూ తన బాల్య మిత్రుడైన రామనాధుణ్ణి గురించి చెప్పనే లేదు. సత్యానందుడు అలా కాదు. అతడు రామనాధుణ్ణి గురించి ఎంతో వివరంగా తన భార్య జలజకు చెప్పాడు. అంతేకాక, పూట కూళ్ళమ్మకు కూడా తను పుట్టి పెరిగిన పల్లె గురించి ఎంతో అభిమానంగా చెప్పుకున్నాడు. అలాంటి ఉత్తముడితో ధనశేఖరుడు విరోధం పెట్టుకున్నాడు. ఇవన్నీ తెలిసిన తర్వాత రామనాధుడు, ధనశేఖరుణ్ణి నమ్మకపోవడంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఈ కారణాలవల్ల, రామనాధుడు తన మిత్రులిద్దరిలో ఎవరు నిజమైన మిత్రులో గ్రహించగలిగాడు. అతడు ధనశేఖరుణ్ణి కాదని, సత్యానందుడి ఇంట వుండేందుకు నిర్ణయించుకోవడం మూర్ఖత్వమనిపించుకోదు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# చందమామ అనుబంధం-56

## మనదేశపు పక్షులు - జంతువులు :

### దుమ్ములగొండి



పిల్లి మియాఁవ్, మియాఁవ్ అంటుంది. కుక్క మొరుగుతుంది. మరి పిల్లీ, కుక్కా కలిసినట్టున్న దుమ్ములగొండి ఏంచేస్తుందో తెలుసా? నవ్వుతుంది! ఈ వింతమృగం దూరం నుంచి శబ్దం పుట్టించాలంటే విచిత్రంగా వికవికా నవ్వుతుంది. అలా నవ్వుతూ ఎముకల పోగు చుట్టూ ఒక విధమైన నాట్యంకూడా చేస్తుంది.

దుమ్ములగొండి కాళ్ళు, కుక్క కాళ్ళ లాగానూ, శరీరం పిల్లి లాగానూ ఉంటుంది. అయితే, దీనికి పిల్లి మృదుత్వంగానీ, అందంగానీ, కుక్క శరీరం లోని శక్తిగానీ ఉండదు. నిక్కబొడుచుకున్న చెవులతో పెద్దతల ఉంటుంది. వెనక కాళ్ళు లావుగానూ, పొట్టిగానూ ఉండడం వల్ల శరీరం వెనకభాగం కిందికి వంగి ఉంటుంది. ఇది 150 సెం.మీ. పొడవూ, 90 సెం.మీ. ఎత్తూ కలిగి ఉంటుంది. బూడిదరంగూ, లేత ఊదా రంగూ కలిసిన శరీరం మీద నల్లటి నిలువు చారలు ఉంటాయి. కాళ్ళమీద కూడా నల్లటి చారలు ఉంటాయి.

దుమ్ములగొండి ఆహారం కోసం ఎప్పుడూ వేటాడదు. ఇతర జంతువులు చంపి తిని వదిలేసిన వాటితోనే కడుపు నింపుకుంటుంది. చాలా పిరికి స్వభావంగల ఈ జంతువు మనుషులకు దూరంగానే ఉంటుంది. అయితే అప్పుడే పుట్టిన శిశువులను దుమ్ములగొండి ఎత్తుకు పోయిందన్న ఉదంతాలు కూడా ఉన్నాయి!



# మన సమకాలీన సాహిత్యం

అస్సాం అడవులలోని బండరాళ్ళకిందభూగర్భంలో పెట్రోలియం కనుగొనబడడంతో, అక్కడి కొండల మీద 'దిగ్బాయ్' పట్టణం ఏర్పడింది. భారతదేశం వివిధ ప్రాంతాల నుంచి కూలీలు అక్కడికి చేరారు. మతాలు వేరయినప్పటికీ వాళ్ళందరూ కలిసి మెలిసి జీవించేవారు.

అలా అక్కడికి చేరిన వాళ్ళలో చాంది అభీర్ ఒకడు. ఒకసారి అతని భార్యకు జబ్బుచేసి సరైన వైద్య సహాయం, ఆహారం లభించక పోవడంతో చనిపోయింది. ఆమె వదిలి వెళ్ళిన సంతానంలో 'పన్నూ' చాలా అందమైన అమ్మాయి.

## బీరేంద్ర కుమార్ భట్టాచార్య 'ప్రతిపాద్'

ఆ పట్టణంలోనే దిన్‌బేశ్వర్ అనే ఒక అధికారి ఉండేవాడు. హిందూమతానికి చెందిన ఆ యువకుడు జహనారా అనే ముస్లిం యువతిని పెళ్ళాడాలను కున్నాడు. అందుకోసం అతడు ముస్లింమతం పుచ్చుకుని గియాసుద్దీన్ అని పేరు మార్చుకున్నాడు. జహనారాను పెళ్ళాడాడు. అయితే, పెళ్ళయిన కొన్నాళ్ళకే దురదృష్టవశాత్తు జహనారా తీరని వ్యాధికి లోనయింది. న్యాయం కోసం పోరాడే మంచి వ్యక్తిత్వం కల తన భర్తకు దూరమై పోతున్నామే అని ఆమె బాధపడసాగింది. తాను వ్యాధిగ్రస్తురాలయినప్పటినుంచి, తన పక్కన ఉండి సాయపడిన చాందిఅభీర్ కూతురు పన్నూను, తన మరణానంతరం తన భర్తను పెళ్ళాడమని చెప్పి జహనారా ప్రాణాలు విడిచింది!

గియాసుద్దీన్ మళ్ళీ మతం మార్చుకుని హిందువు అయితే తప్ప, తన కూతురును పెళ్ళాడడానికి వీలు కాదని పన్నూ తండ్రి పట్టుపట్టాడు. అదే సమయంలో చటర్జీ అనే ఒక యువకుడు పన్నూను ప్రేమించ సాగాడు. అయితే అతను బిడియం కారణంగా ఆ విషయాన్ని బయట పెట్టలేదు.

అంతలో పట్టణ పరిస్థితులలో వేగంగా మార్పులు రాసాగాయి. అవి వ్యక్తిగతమైన సుఖాలు – దుఃఖాలు, బాధలు – విషాదాలకు మించి అందరి దృష్టినీ ఆకర్షించాయి. కార్మికులు ఐకమత్యంతో పోరాడడం బ్రిటిష్ ఆయిల్ కంపెనీ యజమానులకు గిట్టలేదు. ఆధునిక యంత్రాలను ప్రవేశపెట్టి, చాలామంది కార్మికులను పనులనుంచి తొలగించారు.

కార్మికులలో అశాంతి ఏర్పడింది. అలజడి ఆరంభమయింది. వాళ్ళ సమైక్యపోరాటం యజమానులకు భయం పుట్టించింది. ఆఖరికి విభజించి పాలించాలన్న సూత్రం ప్రయోగించి, కార్మికుల మధ్య హిందూ ముస్లిం ద్వేష భావాలను ఉసికొలిపే ప్రయత్నాలలో దిగారు. ఒక మనిషికి డబ్బిచ్చి వాడిచేత ఒక హిందువుల ఆలయంలో గోమాంసం పెట్టించారు. అయితే, వాడు పట్టుబడి పోవడంతో కుట్ర బయటపడింది.



ఇవన్నీ రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడానికి ముందు జరిగాయి. ఆ కాలఘట్టంలో బ్రిటిష్ వాళ్ళు స్వదేశీయులకు కావాలనే దూరంగా ఉండేవారు. ఆంగ్లేయులకూ, భారతీయులకు మధ్య ఎటువంటి మానవ సంబంధాలూ లేవు. కార్మికులు సమ్మె కట్టడంతో, కంపెనీ యాజమాన్యం, దూరం నుంచి కొత్తగా కూలీలను బళ్ళలో తెచ్చిదించింది. అక్కడి కార్మికులు బళ్ళను అడ్డుకున్నారు. ఒక ఆంగ్లేయ అధికారి దానిని సహించలేక వాళ్ళపై కాల్పులు జరిపాడు. ఆ కాల్పులలో పన్నూ తండ్రి చాందిఅభీర్, చటర్జీ, అప్పుడే పెళ్ళి చేసుకున్న గాయకుడు బరూవా, గుడిలోకి గోమాంసం విసిరి పట్టుబడిపోయి, ఆ తర వాత తను చేసిన అకృత్యానికి పశ్చాత్తాపం చెంధి కార్మికులతో భుజం కలిపిన బోధన్ అనే ముఖ్యులయిన నలుగురు కార్యకర్తలు ప్రాణాలు కోల్పోయారు.

ఆంగ్లేయులలోనూ న్యాయంకోసం నిలిచిన కరుణాహృదయులు లేక పోలేదు. అటువంటి వారిలో శ్రీమతి ఫ్లెమియాస్ ఒకరు. ఆమె పీడిత ప్రజలయిన కార్మికులకు అండగా నిలిచింది.

పోరాటం ఇంతటితో ఆగదు; మునుముందు మరిన్ని పెద్ద తుఫానులు వస్తాయి! అన్న హెచ్చరికతో నవల ముగుస్తుంది.

ప్రముఖ అస్సామీ రచయితా, జ్ఞానపీఠపురస్కార గ్రహీతా అయిన బీరేంద్ర కుమార్ భట్టాచార్య రచించిన సుప్రసిద్ధ నవల 'ప్రతిపాద్' ఇతివృత్తం ఇది. ఈ నవల 1939వ సం॥ దాదాపు పదివేల మంది పాల్గొన్న దిగ్బొయ్ కార్మికుల సమ్మె నేపథ్యంతో రచింప బడిందని చెబుతారు. పాత్రలూ, సన్నివేశాలూ ఎంతో వాస్తవికంగా చిత్రింప బడ్డాయి. ఈ నవలను 'నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా', వివిధ భారతీయ భాషలలోకి అనువదించింది.

# మీకు తెలుసా?

1. మైసూరు సుల్తాన్ టిప్పు రాజధాని ఏది?
2. గరుడపక్షి, పాము ఏదేశ పతాకంలో చోటుచేసుకున్నాయి?
3. ఇంగ్లాండులో పొగాకును ప్రవేశపెట్టిన వారెవరు?
4. 1939వ సం॥ సెప్టెంబర్ 3వ తేదీ జరిగిన ముఖ్యమైన సంఘటన ఏది?
5. రవీంద్రనాథ టాగూర్‌కు నోబెల్ బహుమతిని తెచ్చిపెట్టిన రచన ఏది?
6. 'డైనమైట్'ను కనుగొన్నవారెవరు?
7. 'హోల్కర్లు' ఎక్కడినుంచి పరిపాలించారు?
8. 'యూకలిప్టస్' చెట్లు విరివిగా ఉన్న దేశం ఏది?
9. 'సెలోన్' ఎప్పుడు 'శ్రీలంక' అయింది?
10. 'శబర్మతి సాధువు' అని ఎవరిని పిలిచే వారు?
11. పర్షియా రాజ్యస్థాపకుడు ఎవరు?
12. సతీ సహగమనాన్నీ, బాల్యవివాహాలను వ్యతిరేకించి పోరాడిన భారతీయ సంఘసంస్కర్త ఎవరు?
13. అంతరిక్షంలోకి వెళ్ళిన మొట్టమొదటి వ్యక్తి ఎవరు?
14. సూర్యమండలంలోని అతిపెద్ద గ్రహంఏది?
15. అమృతసర్ లోని స్వర్ణదేవాలయాన్ని ఒక శిక్కుమత గురువు నివసించినచోట నిర్మించారు. ఆయన ఎవరు?
16. ఒక అడుగు పొడవు గల నాలుక ఉన్నప్పటికీ కంఠస్వరం లేని జంతువు ఏది?
17. నోబెల్ శాంతి బహుమతీ గ్రహీతలలో అతిపిన్న వయసు వారెవరు?
18. ఆర్యసమాజ స్థాపకుడు ఎవరు?
19. కోలార్ బంగారు గనులు ఏ రాష్ట్రంలో ఉన్నాయి?
20. 'లోక్‌సభ'ను రద్దు చేసే అధికారం 'స్పీకర్'కు ఉన్నదా? లేకుంటే ఎవరికి ఉన్నది?

## సమాధానాలు

1. శ్రీరంగపట్నం.
2. మెక్సికో.
3. సర్‌వాల్టర్ ర్యాలీ (1552 - 1618) అనే అంగ్లేయుడు.
4. ఇంగ్లాండు, జర్మనీ మీద యుద్ధం ప్రకటించింది.
5. గీతాంజలి.
6. అల్‌ఫ్రెడ్ నోబెల్ (1867)
7. ఈ నాటి మధ్యప్రదేశ్‌లోని ఇండోర్.
8. ఆస్ట్రేలియా.
9. మే 1972.
10. మహాత్మాగాంధి.
11. సైరస్ చక్రవర్తి (క్రీ.పూ. 500 - 400).
12. రాజారాం మోహన్‌రాయ్.
13. సోవియట్ వ్యోమగామి యూరీ గగారిన్.
14. గురు గ్రహం (142, 800 కి.మీ. వ్యాసం).
15. గురురాం దాస్.
16. జిరాఫీ.
17. మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్. 1964వ సం॥లో 35వ యేట లభించింది.
18. స్వామి దయానంద సరస్వతి.
19. కర్నాటక.
20. లేదు. రాష్ట్రపతికి.




చంద్రనాధుడనే ఒక గృహస్థుకు సాధు జనులంటే ప్రీతి. ఒక రోజున ఆయన, బైరాగి ఒకడిని తన ఇంటికి పిలిచి పాదపూజ చేశాడు. బైరాగి ఎంతో సంతోషించి, ఏమైనా కోరుకోమన్నాడు.

చంద్రనాధుడు వినయంగా, "స్వామీ! నాకే కోరికా లేదు. భగవత్కృప వల్లా, తమవంటి మహాత్ముల దీవెనలవల్లా నాకు డబ్బుకూ, సుఖాలకూ లోటు లేదు. కానీ ఎందువల్లనోనాభార్య భ్రమరాంబ ఎప్పుడూ అసంతృప్తితో బాధ పడుతూంటుంది. కారణం తెలియదు. ఇందుకు తమరేమైనా విరుగుడు చెప్పగలరా?" అన్నాడు.

బైరాగి తలవూపి భ్రమరాంబను పిలవమన్నాడు. ఆమె వచ్చి అతడడిగిన ప్రశ్నలన్నిటికీ బదులిచ్చింది.

భ్రమరాంబకు భర్త ప్రేమ లభిస్తున్నది. కోరిన కోరికలు తీరుతున్నాయి. పనులు చేయడాని కింటినిండా పనివాళ్ళున్నారు. తీరిక సమయాల్లో మంచి పుస్తకాలు చదువుతుంది. హాయిగా సంగీతం పాడుకుంటుంది.

"మరి నీకు అసంతృప్తి దేనికి?" అని అడిగాడు బైరాగి.

"ఏమో– అదే నాకూ తెలియడం లేదు. మా మేడ పక్కనే చిన్న పెంకుటిల్లుంది. అందులో వీరభద్రుడనే ఆయనుంటున్నాడు. ఆయన కుటుంబానికి అతికష్టం మీద రోజులు గడుస్తున్నాయి. అయినా వీరభద్రుడి భార్య కాంతమ్మ ఎప్పుడూ ఉత్సాహంగానూ, సంతోషంగానూ ఉంటుంది. అంతా పూర్వజన్మ సుకృతం అనుకోవాలి!" అన్నది భ్రమరాంబ.

బైరాగి ఒక క్షణం ఆలోచించి, "తన కోసమే బ్రతికే మనిషికి తృప్తి వుండదు. కాంతమ్మ తన కోసం ప్రతిఫలం లేకుండా

జొన్నలగడ్డ రామలక్ష్మి



కష్టపడడం వల్లనే ఉత్సాహంగానూ, ఎంతో తృప్తిగానూ వుంటున్నదనుకొంటాను. నువ్వు కూడాఇతరులకుఅడపాదడపా సాయపడు. నీ లోని అసంతృప్తి క్రమంగా తొలగిపోతుంది," అన్నాడు.

ఆమాటలుభ్రమరాంబకంతగా రుచించలేదు. కానీ బైరాగి నిజమే చెబుతున్నాడేమో అనిపించింది.ఎందుకంటే,అందరూతనకు సాయపడేవాళ్ళే తప్ప, తనెప్పుడూ ఎవరికీ సాయపడలేదు మరి!

అంతలో అక్కడికి అచ్చమ్మ వచ్చింది. అది పేదరాలు. నాలుగిళ్ళల్లో పని చేసి పొట్టపోసుకుందామని ఈ ఊరొచ్చింది. కానీ ఇంతవరకూ వీరభద్రుడింట్లో తప్ప ఇంకెక్కడా పని దొరక లేదు. ఒకసారి భ్రమరాంబ నడిగితే, కొద్ది రోజులాగి కనపడ మన్నది. అందుకని అచ్చమ్మ ఈరోజు భ్రమరాంబను చూడవచ్చింది.

"మా ఇంట్లోనే బోలెడు మంది పని వాళ్ళు. నిన్నేం చేసుకోను?" అన్నది భ్రమరాంబ.

అచ్చమ్మ వెళ్ళిపోతూంటే బైరాగి ఆపి, "నువ్వు వీరభద్రుడింట్లో పని చేస్తున్నావా? వాళ్ళు డబ్బుకిబ్బంది పడుతూ పని మనిషిని కూడా పెట్టుకున్నారా?" అని ప్రశ్నించాడు.

దానికి అచ్చమ్మ, "అయ్యా, ఎవరైనా ఉట్టినే డబ్బు సాయం చేస్తే నేను తీసుకోను. ఉన్నంతలో నాకు సాయపడ్డట్లూ వుంటుందనీ, తమకు పని సాయముంటుందనీ వాళ్ళు నన్ను పనిలో పెట్టుకున్నారు. వాళ్ళ ఇబ్బందులేమిటో నాకు తెలియదు కానీ, తాము తిన్నదే నాకూ పెడతారు. నేను ఒక్క వరహా చాలన్నా, నాకు వేరే ఎక్కడా పని లేదని నెలకు రెండు వరహాలిస్తున్నారు. తిండి ఖర్చు అక్కడే వెళ్ళిపోతున్నది. పడక కూడా వాళ్ళ ఇంటి అరుగుమీదే! పని చేసేందుకు నాలుగిళ్ళు దొరికితే, నేను వేరే ఇల్లు చూసుకుని వుండొచ్చునని ఆశ!" అన్నది.

భ్రమరాంబ వెంటనే, "నీ కింత ఇబ్బంది వున్నదని తెలియదు. రెండు పూటలా తిండి

పెట్టి నెలకు పది వరహాలిస్తాను. మా ఇంట్లో వుండు," అన్నది.

"అలాగే వుంటానమ్మా. కానీ కాంతమ్మ గారింట్లో పని మానమనొద్దు. ఆ అమ్మకు నేను లేనిదే అసలు గడవదు," అన్నది అచ్చమ్మ.

భ్రమరాంబ కీమాట నచ్చలేదు. కానీ కాదంటే బైరాగి తనను తప్పు పడతాడని వూరుకుంది. తనవల్ల కాంతమ్మకు నష్టం కలక్కూడదు కదా మరి!

బైరాగి, భ్రమరాంబ మంచి గుణాన్ని మెచ్చుకుని, "కొంతకాలం తర్వాత మళ్ళీ వస్తాను. అప్పటికి నీ అసంతృప్తి పూర్తిగా పోతుందని, నా నమ్మకం," అని వెళ్ళి పోయాడు.



భ్రమరాంబ ఇంట్లో అచ్చమ్మకు చెప్ప డానికి పెద్దగా పనేమీలేదు. అందువల్ల, భ్రమరాంబ ఆమె చేత రోజూ మంచాలు, బీరువాలు గుడ్డతో తుడిపించేది. దేవుడికి పూర్వం పూలతో పూజ చేసేది. ఇప్పుడు అచ్చమ్మచేతమాల కట్టించి పూజ చేస్తున్నది.

ఇలాంటి పనులయ్యాక అచ్చమ్మ కాస్త విశ్రాంతిగా కనబడితే,భ్రమరాంబలో అసం తృప్తి రేగేది. ఆమె ఏ మాత్రం అవసరంలేని పనులు అచ్చమ్మకు పురమాయిస్తూండేది. వీధి చివర డాబా ఇంట్లో వున్న రమణయ్య గారి భార్య శకుంతలమ్మ, వియ్యంకుల ఇంటి నుంచి తిరిగొచ్చిందో లేదో చూసి రమ్మనో, పెరట్లో కాకి ఒకటేపనిగా అరుస్తు న్నది, దాన్ని తోలమనో, వీధిలో ఆగోలే మిటి? ఎవరైనా దెబ్బలాడు కుంటున్నారా? కాస్త కిటికీలోంచి తొంగి చూడమనో— ఇలాంటి అనవసరమైనపనులు అచ్చమ్మకు చెబుతూండేది.

అచ్చమ్మ అన్ని పనులూ అవలీలగా చేసేది. అయితే, ఆమె కాంతమ్మ ఇంట్లో ఉత్సాహంగా వుండేది, భ్రమరాంబ దగ్గిర నిరుత్సాహంగా వుండేది. మాటవరస క్కూడా అచ్చమ్మ, కాంతమ్మ గురించి తప్పుగా అనదు, అననివ్వదు. ఇదంతా చూసి భ్రమరాంబకు అసంతృప్తి మరింత పెరిగింది.

కొంతకాలానికి బైరాగి తిరిగి వచ్చి సంగతి తెలుసుకున్నాడు. అచ్చమ్మ ప్రవర్త నకు కారణం తెలుసుకునేందుకు అక్కడి నుంచి కాంతమ్మ ఇంటికి వెళ్ళాడు. అక్కడి పరిస్థితి స్వయంగా తెలుసుకుని తిరిగి వచ్చాక, భ్రమరాంబ ఇంటి పరిస్థితిని గమ నించాడు.

అంతా శ్రద్ధగా చూస్తున్న భ్రమరాంబ, బైరాగిని, "తేడా ఏమైనాతెలిసిందా,స్వామీ?" అని అడిగింది.

అందుకు బైరాగి, "కాంతమ్మ ఇంట్లో పనెక్కువ. అయితే ఆమె అచ్చమ్మ చేత అవసరం మేరకు మాత్రమే పని చేయించు కుంటుంది. వాళ్ళింట్లో మంచి నీళ్ళు తాగితే లోటాను నీళ్ళతో తొలుచుకుని మళ్ళీ వాడుతారు తప్ప, ఎప్పటికప్పుడు పని మనిషిని తోమ మనరు. తాము పని చేసే టప్పుడు ఎలా ప్రవర్తిస్తారో, పనిమనిషి విషయంలోనూ అలాగే ప్రవర్తిస్తారు. ఆమెను తమలో ఒకతెగా భావిస్తారు. జీతం ఇవ్వడం వరకు మాత్రమే ఆమె పని మనిషి. అందువల్ల అక్కడ ఆమె ఉత్సా హంగా వుంటుంది," అన్నాడు.

"నేను మాత్రం దానికి తక్కువేం చేశాను?" అన్నది భ్రమరాంబ ఎంతో ఉక్రో షంగా.

"ఇంకా అర్థం కాలేదా? వాళ్ళు పని వుందని పని చేయించు కుంటున్నారు. నువ్వు పనిమనిషి వుందని పని చేయించు కుంటున్నావు. రెండింటికీ తేడా లేదూ?" అన్నాడు బైరాగి మందలింపు ధోరణిలో.

భ్రమరాంబకు తన తప్పు అర్థమయింది. ఆమె ఏదో అనబోయేంతలో బైరాగి, "నీ అసంతృప్తికి కారణం అసూయ. కాంతమ్మ నీకంటే సంతోషంగా వుండడం, నువ్వు భరించలేక పోతున్నావు. ఆ అసూయను విడిచిపెట్టి కాంతమ్మతో స్నేహం చెయ్యి. గొప్ప కోసం కాక మంచి బుద్ధితో ఇతరు లకు సాయపడు. అప్పుడు నీకు కలిగే తృప్తికి అంతుండదు," అన్నాడు.

భ్రమరాంబ, బైరాగి సలహా పాటించి క్రమంగా అందులోని నిజం గ్రహించింది.



# చందమామ కబుర్లు



## భారతీయ విద్యార్థికి అమెరికా ప్రోత్సాహం!

వాషింగ్టన్ సమీపంలోని ఫేర్‌ఫాక్స్ కౌంటీలో అఖిల్ రస్తోగీ అనే పదకొండేళ్ళ కుర్రాడు ఆరవ తరగతి చదువు తున్నాడు. ఆ అబ్బాయి తల్లి దీప ఒక బ్యాంక్ ఉద్యోగిని. ఆమె కుడి చేతి నరాలు దెబ్బతిన్నాయి. అందువల్ల జగ్గు తీసి, కప్పులోకి పాలు పోసేప్పుడు, పాలు ఒలికి పోయేవి. దానిని చూసి బాధపడిన అఖిల్ తీవ్రంగా ఆలోచించి ఒక ప్లాస్టిక్ స్క్రూ గొట్టాన్ని రూపొందించాడు. దాని సహాయంతో ఎవరైనా సరే జగ్గునుంచి ఒలక కుండా పాలను కప్పులోకి పోసే సదుపాయం ఏర్పడింది. దానిని చూసి తల్లి ఎంతో సంతోషించింది. కుటుంబమిత్రులు ఆపరికరానికి 'పేటెంట్' కోసం దరఖాస్తు పెట్టమన్నారు. ఒక అమెరికా సంస్థ పేటెంట్ మంజూరు చేసింది. ఆ విధంగా అఖిల్, అమెరికా పేటెంట్‌ను పొందిన అతి పిన్న వయస్కులలో ఒకడయ్యాడు!

## ఆంగ్లంలో 'గళ్ళనుడి కట్టు'

ఆంగ్లంలో 'గళ్ళనుడికట్టు' ఆటను స్క్రేబుల్ అని అంటారు. ఇంగ్లీషు నేర్చుకునే విద్యార్థులు ఈ ఆటను ఆసక్తిగా ఆడతారు. విద్యార్థుల 'పదసంపద'ను ఇది పెంచుతుంది. ఆల్ ఫ్రెడ్ బట్స్ అనే ఒక శిల్పకారుడు ఈ ఆటను రూపొందించాడు. ఆయన తన 93వ యేట గత ఏప్రిల్‌లో మరణించాడు. ఆయన ఈ ఆటను 1930వ సం॥లో రూపొందించాడు. దానిని అతడు బోర్డు వ్యాపారులకు అమ్మచూశాడు. కాని ఎవరూ కొనలేదు. 20 ఏళ్ళ తరవాత దానినొక చిన్న వ్యాపారసంస్థ విడుదల చేసింది. పిల్లలు దానిపట్ల చూపిన అపార ఆసక్తిని గ్రహించి, మొదట నిరాకరించిన సంస్థ మళ్ళీదానిని తీసుకుని భారీఎత్తున తయారు చేసి విడుదల చేసింది. ఈ ఆధార సూత్రంతోనే ప్రయాణం చేసేప్పుడు ఆడడానికి వీలుగా 'మేగ్నటిక్ సెట్' కూడా రూపొందించారు. ఆ తరవాత అది వివిధ ప్రపంచ భాషలలో వెలువడింది. ఇప్పటికి అది కోట్ల వరకు అమ్ముడయి ఉండవచ్చని ఒక అంచనా!






ఖలీఫా హారూన్ అల్‌రషీద్ కొలువులో ఒకప్పుడు బుహ్లూల్ అనే విదూషకుడు ఉండేవాడు. అతను కేవలం విదూషకుడే గాక జ్ఞాని కూడానూ.

ఒకనాడు ఖలీఫా తన విదూషకుడితో, "బుహ్లూల్, మన బాగ్దాద్‌నగరంలో ఎంత మంది మూర్ఖులున్నారో నీకు తెలుసునా?" అని అడిగాడు.

తెలుసు నన్నాడు విధూషకుడు.

"అలా అయితే వారందరి పేర్లు పట్టీ తయారుచెయ్యి. అందులో ఒక్క పొరపాటు కూడా చెయ్యకూడదు, తెలిసిందా?" అన్నాడు ఖలీఫా.

విదూషకుడు విరగబడి నవ్వి, "అంత కంటే బాగ్దాద్ నగరంలో ఉండే జ్ఞానుల జాబితా తయారు చెయ్యటం సులువు. ఆ జాబితా తయారుచేస్తాను. అందులో లేని వారంతా మూర్ఖులే అనుకోండి," అన్నాడు.

బుహ్లూల్ ఒకనాడు ఖలీఫాలేనిసమయం చూసి ఆయన సింహాసనంపై కూర్చున్నాడు. ఈ సాహసం చేసినందుకు దర్బారు ఉద్యోగులు అతన్ని కర్రలతో కొట్టించారు.

ఖలీఫా వచ్చేసరికి విదూషకుడు బాధతో ఏడుస్తూ కనిపించాడు. ఖలీఫా జరిగిన సంగతి అంతా విని తన విదూషకుణ్ణి ఓదార్చబోయాడు.

"ఏలినవారు పొరబడుతున్నారు. నేను నాకు తగిలిన దెబ్బలను గురించి ఏడవటం లేదు. కాస్సేపు సింహాసనం మీద కూర్చున్నందుకే నాకిన్ని దెబ్బలు తగిలితే, ఏళ్ల తరబడి కూచునే తమకు ఆ లోకంలో ఎన్ని దెబ్బలు తగులుతాయో గదా అని విచారిస్తున్నాను!"అన్నాడు విదూషకుడు.

బుహ్లూల్‌కు పెళ్లి అంటే పడేదికాదు. ఈ సంగతి తెలిసి ఖలీఫాకు కోపం వచ్చింది. ఆయన ఒకనాడు తన బానిసలలో ఒకతెను,

అందమైనదాన్ని ఏరి, తన విదూషకుడి కిచ్చి బలాత్కారంగా పెళ్లిచేశాడు. ఆ రాత్రి పెళ్లికూతురు వచ్చి తన పక్కన కూచోగానే విదూషకుడు చివాల్న లేచి, "ఓయమ్మో ! ఓయి బాబో !" అని బిగ్గరగా కేకలు వేస్తూ రాజమందిరం అంతటా అటూఇటూ పరిగెత్తాడు.

ఖలీఫా అతన్ని పిలిపించి, "దుర్మార్గుడా, నీకు చక్కని పిల్లనిచ్చి పెళ్లిచేస్తే దాన్ని వదిలేసిచావుకేకలుపెడుతూపారిపోతావా?" అని అడిగాడు.

దానికి విదూషకుడు, "ఏలినవారు క్షమించాలి! నా భార్య అందమైనదే, సందేహం లేదు. కాని ఆమె నాదగ్గరికి వచ్చి కూచోగానే ఆమె గుండెలోనుంచి గొంతుకలు వినిపించాయి. 'నాకు మంచి బట్టలు కావాలి, నాకు మంచి నగలు కావాలి,' అని ఆ గొంతుకలు అనటం విని నేను బెదిరి పారిపోయాను!" అన్నాడు.

అయితే బుహ్లూల్ ఈ మాట లన్నది ఖలీఫానుంచి డబ్బు రాబట్టటానికి కాదు. ఎందుకంటే ఒకసారి ఖలీఫా తన విదూషకుడికి వెయ్యి బంగారు దీనారాలుబహుమతి ఇచ్చాడు. కాని విదూషకుడు దానిని నిరాకరించాడు. మరి కొంతకాలానికి ఖలీఫా మరోసారి వెయ్యి దీనారాలు ఇవ్వబోతే విదూషకుడు అప్పుడుకూడా అవి తీసుకోవటానికి నిరాకరించాడు.

"నేను సంతోషించి బహుమతి ఇస్తే తీసుకోక నిరాకరిస్తావు, ఏమిటి కారణం?"



అని ఖలీఫా అడిగాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా విదూషకుడు తన అరికాలు ఎత్తి ఖలీఫా మొహం ముందు పెట్టాడు.

ఈ దుండగం కళ్లారా చూసిన ఖలీఫా సేవకులు, విదూషకుడిపై బడి చావ గొట్టబోయారు.

కాని ఖలీఫా వారిని వారించి, "ఎందుకు ఇలా అమర్యాదగా ప్రవర్తిస్తున్నావు?" అని అడిగాడు.

"ఏలినవారు గమనించాలి. నేను తమ కేసి చేతులు చాచి తమరి బహుమానాలు స్వీకరించినట్టయితే, నాకిప్పుడు తమకేసి కాళ్లు చాచే హక్కుండేది కాదు," అన్నాడు విదూషకుడు.

ఒకసారి ఖలీఫా యుద్ధంచేసి విజయంతో తిరిగివస్తున్నాడు. ఆసమయంలో ఖలీఫా వెంట బుహ్లూల్ కూడా ఉన్నాడు. ఒక మజిలీలో అర్ధరాత్రి వేళ ఖలీఫాకు అపరిమితంగా దాహమయింది. ఆయన, "నీరు, నీరు !" అని అరవటం విని విదూషకుడు లేచి వెళ్లి నీరు తెచ్చాడు.

"ఈ నీరు తాగేముందు ఏలినవారు దయచేసి ఒక్క ప్రశ్నకు సమాధానం చెప్పాలి. ఈ నీరు లభ్యం కాని పక్షంలో దీనికోసం ఏలిన వారు ఎంత ఇచ్చిఉండే వారు?" అన్నాడు విదూషకుడు.

"అర్ధరాజ్యం ఇచ్చేవాణ్ణి!" అంటూ ఖలీఫా నీరు తాగాడు.

"మరొక్క అనుమానానికి కూడా ఏలిన వారు సమాధానం చెప్పాలి తాగిన నీరు అల్పాచమానం రూపంలో బయటికి రాక, లోపలే అలాగే బిగదీసుకు పోతే దాన్ని బయటికి రప్పించటానికి ఎంత ఇస్తారు?" అని విదూషకుడు అడిగాడు.

"అవసరమైతే అర్ధరాజ్యం ఇస్తాను!" అన్నాడు ఖలీఫా.

"ఇన్ని నీళ్లకూ, ఇంత అల్పాచమానానికీ సమానమైన విలువ గల రాజ్యం కోసం యుద్ధాలు దేనికి, ప్రభూ?" అన్నాడు బుహ్లూల్.

ఖలీఫా ఎంతో సిగ్గుతో తల వంచుకున్నాడు.






రాముడు సీతతో కోపం కొద్దీ ఇంత పరుషంగా మాట్లాడే సరికి, వింటున్న వాళ్ళకు భయమూ, జలదరింపూ కలిగాయి. ఎన్నడూ ఇలాటి మాటలు పడి ఎరగని సీత వంచిన తలను మరింతగా వంచుకుని, అంత మంది మధ్య జరిగిన అవమానానికి కన్నీరు కార్చింది.

ఆమె కన్నీరు తుడుచుకుంటూ డగ్గుత్తికతో, "వీరుడా, ఎందుకు ఇలాటి మాటలు అంటున్నావు? అవి అజ్ఞాని అయినవాడు తనకు తెలియనిదాన్ని గురించి మాట్లాడే మాటలు. నేను వినటానికి యోగ్యమైనవి కావు. నువ్వు అనుకుంటున్నట్టు నేను చెడిపోలేదు. కావాలంటే తగిన పరీక్ష ఏదైనా పెట్టు. స్త్రీలలో చెడ్డవాళ్ళు ఉన్నారు గదా అని స్త్రీలందరినీ చెడ్డవాళ్ళుగా భావించకు. నా స్వభావం నీకు బాగా తెలిసి ఉన్నట్టయితే నా మీద అనుమానం విడిచిపెట్టు. రావణుడు నన్నెత్తుకుపోయినప్పుడు వాడి శరీరం నాకు తగిలితే అది నా అసహాయత వల్ల జరిగినది కాబట్టి, ఆ తప్పు దైవానిది, నాది కాదు. నా ఆధీనంలో ఉండిన నా మనసు మాత్రం నీ మీదనే ఉన్నది. ఇంతకాలం కలిసి ఉన్న తరవాత నా స్వభావం నీకు తెలియకపోతే, నీకు అది మరి ఏ విధంగానూ తెలిసే అవకాశం లేదు. నన్ను విడిచిపెట్ట దలచినవాడివైతే నన్ను వెదకటానికి హనుమంతుణ్ణి ఎందుకు పంపావు? నన్ను విడిచిపెట్టి నట్టు ఆ హనుమంతుడి ద్వారా కబురు చేసినా,



హనుమంతుడు చూస్తూండగానే ప్రాణాలు విడిచి ఉండేదాన్ని. నీకు ఈ యుద్ధం చేసే అవసరం కూడా లేకపోను. నీ మిత్రులు ఇంతదూరం రావలసిన శ్రమ కూడా తప్పి ఉండును," అన్నది.

తరవాత ఆమె లక్ష్మణుడితో, "లక్ష్మణా, నా బాధకు విరుగుడుగా చితిని పేర్చు. అందులో పడి ప్రాణాలు విడుస్తాను. ఇంత మాట పడి బతికి ఉండటం నా కిష్టంలేదు. ఇంతమంది ఎదట నా భర్త నన్ను వదిలేస్తే అగ్ని ప్రవేశం తప్ప నాకు వేరే గతి ఏము న్నది?" అన్నది.

ఈ మాటకు ఎంతో నొచ్చుకుంటూ లక్ష్మణుడు రాముడి ముఖం కేసి చూశాడు. రాముడి వాలకం చూస్తే సీత అగ్నిప్రవేశం చెయ్యటం అతనికి ఏ మాత్రం అభ్యంతరం లేనట్టు కనబడింది. అందుచేత లక్ష్మణుడు వెంటనే సీత కోరిన ప్రకారం అక్కడ చితి పేర్చాడు.

చితి బాగా మండుతున్నది. తల వంచు కున్న రాముడి చుట్టూ ప్రదక్షిణం చేసి, సీత చితిని సమీపించింది. ఆమె చేతులు మోడ్చి, "నా మనసు రాముడి మీద తప్ప మరొక పురుషుడి మీదికి పోదన్నమాట నిజమైతే ఈ అగ్నిహోత్రుడు నన్ను కాపాడు గాక! సూర్యుడూ, వాయువూ, దిశలూ, చంద్రుడూ, పగలూ, రాత్రీ, ఉభయ సంధ్యలూ, భూమీ, ఇతర దేవతలూ నేను పతివ్రతనని ఒప్పుకున్న పక్షంలో అగ్ని హోత్రుడు నన్ను రక్షించుగాక!" అని, చితికి ప్రదక్షిణం చేసి, మండుతున్న చితిలో ప్రవే శించింది.

ఇది చూసి అక్కడ చేరిన వారందరూ హాహాకారాలు చేశారు. రాముడు కళ్ళ వెంట నీరు కార్చుతూ విచారంగా అలాగే ఉండి పోయాడు.

అంతలోనే చితి చెల్లాచెదరైపోయింది. దానిలో నుంచి అగ్నిహోత్రుడు మనిషి రూపంలో సీతను ఎత్తుకుని ఇవతలికి వచ్చాడు.

సీత ముందులాగే నగలు ధరించి, ఎర్రచీర కట్టుకుని, నొక్కులు నొక్కుల

నల్లని జుట్టుతో, ఏ మాత్రమూ కందిపో కుండా ఉన్నది.

అగ్నిహోత్రుడు రాముడితో, "రాముడా, ఇదుగో నీ భార్య అయిన సీత! ఈమె ఏ పాపమూ ఎరుగదు. ఈమె నిన్ను తప్ప మరొక పురుషుణ్ణి తలవలేదు. రావణుడు ఈమెను తన అంతఃపురంలో ఉంచి, భయంకర రాక్షస స్త్రీలను కాపు పెట్టి, ఎన్నో ఆశలుపెట్టాడు. ఎన్ని విధాలనో బెదిరించాడు. అయినా ఆమె రావణుణ్ణి తలచనే లేదు. ఈ సీతను పరిగ్రహించి ఏలుకో. ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

అగ్ని ఇలా చెప్పినందుకు రాముడు చాలా తృప్తి పడ్డాడు; ఇలాటి దాన్ని అవమానించి, అగ్నిప్రవేశం చేయించినందుకు చాలా విచారించి, కన్నీరు కార్చాడు. అతను అగ్నిహోత్రుడితో ఇలా అన్నాడు: "సీతలో ఏ పాపమూ లేని మాట నిజమే. అయితే ఆమె రావణుడి ఇంట చాలాకాలం ఉన్నది. నేను సీతను పరీక్షించకుండా స్వీకరించి ఉంటే, లోకులు, 'దశరథ మహారాజు కడుపున పుట్టిన ఈ రాముడు ధర్మం తెలిసినవాడు కాడు,' అని అందురు. మూడు లోకాలకూ నిజం తెలియ గలందులకు, సీత అగ్నిప్రవేశం చేస్తూంటే చూస్తూ ఊరుకున్నాను, ఆమెకు నా యందే ప్రేమ అని తెలియక కాదు. మీ ఆజ్ఞ తప్పక శిరసా వహిస్తాను," అన్నాడు.

ఆ సమయంలో స్వర్గం నుంచి దశరథుడు దివ్యవిమానంలో అక్కడికివచ్చాడు.





ఆయనను చూసి రామ, లక్ష్మణులు నమస్కారం చేశారు. దశరథుడు తన ప్రియ పుత్రుడైన రాముణ్ణి కౌగిలించుకుని ఇలా అన్నాడు:

"నాయనా, రామా! నిన్ను విడిచి ఉండడంచేత నాకు ఈ స్వర్గసుఖాలూ, దేవర్షులు నాకు చూపించే గౌరవమూ ఆనందం కలిగించలేక పోయాయి. శత్రువులను చంపి, వనవాసదీక్ష పూర్తి చేసిన నిన్ను చూస్తే నాకు పరమానందంగా ఉన్నది. నిన్ను అడవికి పంపమని కైకేయి కోరిన కోరిక ఇంకా నా మనస్సును వేధిస్తూనే ఉన్నది. రావణుణ్ణి నువ్వు చంపటం కోసం దేవతలే నీ పట్టాభిషేకానికి విఘ్నం కలిగించారని నాకిప్పుడు తెలిసింది. నువ్వు వనవాసం మాని ఇంటికి తిరిగి వెళ్ళగానే కౌసల్య సంతోషిస్తుంది. నువ్వు వెళ్ళి పట్టాభిషేకం చేసుకో. రాజ్యపాలన చేస్తూ నీ తమ్ములతో సహా సుఖంగా ఉండు."

రాముడు చేతులు జోడించి దశరథుడితో ఇలా అన్నాడు: "నన్ను వనవాసానికి పంపమనే పక్షంలో కైకేయినీ, భరతుణ్ణీ విడిచిపెట్టుతానన్నావు. ఇప్పుడు వాళ్ళ మీద అనుగ్రహం చూపించు."

దశరథుడు అందుకు ఒప్పుకుని, లక్ష్మణుణ్ణి కౌగలించుకుని, అతను రాముడికి చేసిన సేవలను ప్రశంసించాడు. తరవాత ఆయన సీతతో, "రాముడు నిన్ను విడిచిపెట్టుతానన్నందుకు కోపగించుకోకు," అని చెప్పి, సంతోషంగా స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు.

తరవాత ఇంద్రుడు రాముడి ముందుకు వచ్చి, ఏదైనా వరం కోరుకోమన్నాడు. తన కోసం ప్రాణాలర్పించిన వానరులందరూ తిరిగి బతికేలాగు చెయ్యమని రాముడు ఇంద్రుణ్ణి కోరాడు. ఇంద్రుడు అందుకు సమ్మతించాడు. మరు క్షణమే యుద్ధరంగంలో అవయవాలూ, తలలూ తెగి, చచ్చిపడి ఉన్న వానరులూ, భల్లూకాలూ చెక్కు చెదరకుండా నిద్రలేచినట్టు బతికి లేవటం చూసి, బతికి ఉన్నవాళ్ళు ఆశ్చర్యపడ్డారు.

అ రాత్రి గడిచి తెల్లవార గానే విభీషణుడు రాముడి కోసం స్నానానికి పనికి వచ్చే నీరూ, సుగంధ లేపనాలూ, బట్టలూ తెచ్చి, రాముడి చేత స్నానం చేయించ టానికి స్త్రీలను కూడా తెచ్చాడు.

రాముడు విభీషణుడితో, "సుగ్రీవుడు మొదలైన వానర వీరులను స్నానానికి పిలువు. నేను వెంటనే అయోధ్యకు పోవాలి. పధ్నాలుగేళ్ళూ నిండిన మర్నాడు నేను కనిపించక పోతే అగ్నిప్రవేశం చేస్తానని శపథం చేసిన నా తమ్ముడు భరతుణ్ణి చూడటం కన్న నాకు ఈ స్నానం వగైరా ముఖ్యం కాదు," అన్నాడు.



దానికి విభీషణుడు, "రామా, నిన్ను ఒక్క రోజు లోపల అయోధ్యకు చేర్చగలను. కుబేరుడి నుంచి రావణుడు బలాత్కారంగా సంగ్రహించిన పుష్పకవిమానం ఉన్నది. నీకూ, సీతకూ, లక్ష్మణుడికీ నేను చేసే సత్కారాలన్నీ స్వీకరించమని నా ప్రార్థన," అన్నాడు.

దానికి రాముడు, "విభీషణా, నువ్వు యుద్ధంలో నాకు సహాయ పడటమే నాకు గొప్ప సత్కారం. నా కోసం చిత్రకూట పర్వతానికి వచ్చిన భరతుణ్ణి చూడాలని నా మనసు చాలా తొందరపడుతున్నది. అంతే గాక మా తల్లులైన కౌసల్యనూ, సుమిత్రనూ, కైకేయినీ, గురువులైన వసిష్ఠుడు మొదలైన వారినీ, స్నేహితులనూ, నగరవాసులనూ చూడాలని కూడా తొందరగా ఉన్నది. అందుచేత వెంటనే పుష్పకవిమానం తెప్పించు. నేనిక్కడ ఒక్క క్షణం కూడా ఉండలేను. వెంటనే నేను వెళ్ళిపోవటానికి అనుజ్ఞ ఇయ్యి," అన్నాడు.

వెంటనే విభీషణుడు పుష్పకవిమానాన్ని తీసుకువచ్చాడు. పూలమాలలతో అలంక రించి ఉన్న ఆ విమానాన్ని రాముడికి చూపి, "ఇంక ఏమిసెలవు?" అని అడిగాడు వినయంగా.

"వానరులు చేసిన సహాయం ఇంతా, అంతా కాదు. వారికి బట్టలూ, నగలూ మొదలైనవి ఇచ్చి సత్కరించు. దేవతలకు లొంగని ఈ లంకానగరం వానరుల



ధర్మమా అంటూ మనకు లొంగింది. వారి శ్రమకు తగిన ప్రతిఫలం చూపించు. వారికి నీ కృతజ్ఞత చూపితే వాళ్ళు ఎంతగానో సంతోషిస్తారు," అని రాముడు విభీషణుడికి చెప్పాడు.

విభీషణుడు ఆ ప్రకారమే వానరవీరుల నందరినీ సత్కరించాడు. తరవాత రాముడు సీతను వెంటబెట్టుకుని పుష్పక విమానం ఎక్కాడు. వాళ్ళ వెనకగా లక్ష్మణుడు కూడా ఎక్కాడు. తరవాత రాముడు వానరుల తోనూ, సుగ్రీవ విభీషణులతోనూ, "మీరు నాకు కార్యసిద్ధి కలిగించారు. ఇక మీరు మీ ఇష్టం వచ్చిన చోటికి పోవచ్చునని నేను అనుమతిస్తున్నాను. సుగ్రీవుడా, నువ్వు బంధువుగానూ, మిత్రుడుగానూ ఎంత చెయ్యవచ్చునో అంతా చేశావు. నువ్వు నీ సేనలతో కిష్కింధకు తిరిగిపోయి, సుఖంగా ఉండు. విభీషణా, నేను నీకిచ్చిన లంకా రాజ్యాన్ని సుఖంగాఏలుకో. దేవతలు కూడా నిన్ను ఎదిరించలేరు. నేనిక అయోధ్యకు బయలుదేరుతాను,మీరు అనుమతించండి," అన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు మొదలైన వానరులూ, విభీషణుడూ రాముడితో, "మాకు కూడా అయోధ్యకు రావాలని ఉన్నది. మమ్మల్ని కూడా తీసుకుపో. అక్కడి ప్రజలకు మావల్ల ఏ బాధా లేకుండా అరణ్యంలోనూ, నగరంలోనూ సంచరిస్తాం. మేం మా కళ్ళారా నీ పట్టాభిషేకం చూసి, కౌసల్యా దేవికి నమస్కరించినాకనే మా ఇళ్ళకు పోతాం," అని వేడుకున్నారు.

"మీరంతా నా వెంట వస్తామంటే నాకు మరీ సంతోషం. సుగ్రీవా, నువ్వూ, నీ వానరులూ వెంటనే పుష్పకంలోకి రండి. విభీషణా, నువ్వూ, నీ మంత్రులూ కూడా రండి," అన్నాడు రాముడు.

సుగ్రీవుడి వెంబడి వానరులూ, విభీషణుడి వెంట అతని మంత్రులూ ఎక్కగానే పుష్పకవిమానం ఆకాశంలోకి లేచింది. అది వాయువేగంతో ఆకాశంలో పోతూ ఉంటే, రాముడు సీతను త్రికూట పర్వతం మీద ఉన్న లంకానగరాన్నీ, రక్తంతో తడిసిన

యుద్ధభూమినీ, తాను రావణుణ్ణి చంపిన స్థలాన్నీ, కుంభకర్ణుణ్ణి చంపిన స్థలాన్నీ, సముద్రాన్నీ, సేతువునూ, విభీషణుడు మొట్టమొదట తన వద్దకు వచ్చిన ప్రదేశాన్నీ, కిష్కింధా నగరాన్నీ, తాను వాలిని చంపిన స్థలాన్నీ చూపాడు.

సీత రాముడితో, "నేను అయోధ్య ప్రవేశించేటప్పుడు నా వెంట సుగ్రీవుడి భార్యలైన తార మొదలైన స్త్రీలనూ, ఇతర వానర ప్రముఖుల భార్యలనూ తీసుకుపోవాలని కోరుతున్నాను," అన్నది.

రాముడు పుష్పకాన్ని కిష్కింధలో ఆపి, సుగ్రీవుడితో, "మీభార్యలందరూ తనవెంట అయోధ్యకు రావాలని సీత కోరుతున్నది. ఆ మాట మీ ఆడవారందరికీ చెప్పు," అన్నాడు.

సుగ్రీవుడు తార దగ్గరికి పోయి, "నిన్నూ ఇతర వానర స్త్రీలనూ అయోధ్యకు తీసుకు రమ్మని రాముడి ఆజ్ఞ. సీతాదేవి అలా కోరిందట. వెంటనే బయలుదేరండి," అన్నాడు.

తార ఆపాదమస్తకమూ అలంకరించుకుని, మిగిలిన వానర స్త్రీలతో, "మనమందరమూ అయోధ్యకు పోయి, అక్కడి విశేషాలు చూసి వద్దాం, బయలుదేరండి," అన్నది.

వానర స్త్రీలు అలంకరించుకుని, సీతను చూడాలన్న కుతూహలంతో తార వెంట బయలుదేరి, పుష్పకవిమానంలో ఎక్కారు. తిరిగి విమానం ఆకాశంలో ప్రయాణం సాగించింది. రాముడు సీతకు ఋశ్యమూక పర్వతాన్నీ, తాను సుగ్రీవుణ్ణి మొదట కలుసుకున్న స్థలాన్నీ, అందమైన పంపా సరస్సునూ, సీతను పోగొట్టుకుని తాను విలపించిన ప్రాంతాన్నీ, కబంధుణ్ణి చంపిన స్థలాన్నీ, ఇతర ముఖ్యమైన ప్రదేశాలనూ చూపాడు.

విమానం అత్రిమహర్షి ఆశ్రమం మీదుగానూ, గుహుడు ఉండే శృంగిబేరపురం మీదుగానూ, చిత్రకూటం మీదుగానూ, భరద్వాజాశ్రమం మీదుగానూ ఎగురుతూ, అయోధ్యా నగరాన్ని చేరవచ్చింది.






# వెయ్యిన్నూటపదహార్లు

అనూరాధ తల్లి చిన్నతనంలోనే పోయింది. తండ్రి మరొక పెళ్ళి చేసుకోవడంతో, ఆమె పన్నెండేళ్ళ వయసు వచ్చే వరకూ అవ్వ దగ్గిరే పెరిగింది. ఆమె సవతి తల్లి దుర్గమ్మ పరమ గయ్యాలి. ఆమెకు ఇద్దరు పిల్లలు. ఒక్కతే ఇంటెడు పనీ చేసుకోవడం కష్టంగా ఉన్నది.

ఒకరోజు భోజనం చేస్తున్న భర్తతో దుర్గమ్మ, "ఆ ముసలిదాని గుడిశెలో మహారాణీలా వున్నది, నీ ముద్దుల కూతురు! వేలు గుమ్మరించి పెళ్ళి చేయాల్సిన ఖర్మ మనకు తప్పేది కాదు. పెళ్ళి లోపల ఏ పనీ పాటా రాకపోతే, సవతి తల్లిని గనక నలుగురూ నన్నాడిపోసుకుంటారు. నువ్వు వెళ్ళి నీ కూతుర్ని తీసుకురా. నాలుగేళ్ళపాటు మనింట్లో వుంచుకుందాం," అన్నది.

దుర్గమ్మ చేతిలో కీలుబొమ్మ ఆమె భర్త. అతడు మారుమాట్లాడ కుండా వెళ్ళి, అనూరాధను తీసుకువచ్చాడు. ఆమె ఆరేళ్ళపాటు సవతి తల్లితో తిట్లు తింటూ అడ్డమైన చాకిరీ చేసింది. పట్నంలోని తన తమ్ముడి స్నేహితుడు పైడిరాజు కానీ కట్నం లేకుండా అనూరాధను చేసుకుంటాడని చెప్పి, భర్త చేత పెళ్ళికి ఒప్పించింది దుర్గమ్మ. ఈ పైడిరాజు చిల్లర దొంగతనాలతో బతుకుతున్నవాడని, తమ్ముడి ద్వారా దుర్గమ్మకు ముందే తెలుసు.

పెళ్ళికి ముందు తనకు పట్నంలో ఉద్యోగం అని చెప్పాడు, పైడిరాజు. కాపరానికివచ్చిన వారం రోజుల్లోనే, అతడి ఉద్యోగమేమిటో తెలిసిపోయింది, అనూరాధకు.

"మోసం చేసి సంపాదించిన డబ్బు సుఖాన్నీ, శాంతినీ యివ్వలేదు. ఏదైనా కష్టపడి సంపాదించే మార్గం చూడు!" అని అనూరాధ భర్తను ఎన్నో విధాలుగా బ్రతిమిలాడింది.

మాచిరాజు కామేశ్వరరావు



"బతకడం చేతకాని దద్దమ్మలు కాయ కష్టం చేస్తారు. నాకా ఖర్మ పట్టలేదు," అనే వాడు పైడిరాజు హేళనగా.

అనూరాధ కాపరానికి వచ్చిన ఆరుమాసాలకు, ఆమె అవ్వ నుంచి ఆఖరిసారిగా చూడాలనుకుంటున్నట్టు కబురు వచ్చింది. అప్పటికప్పుడు బాడుగబండిలో అవ్వ ఊరుకు వెళ్ళింది, అనూరాధ. కుక్కి మంచంలో ఎముకల గూడులా వున్న అవ్వను చూసి, ఆమెకు దుఃఖం పొంగుకు వచ్చింధి.

అవ్వ, అనూరాధనడిగి ఆమె భర్త ఎటువంటి వాడయిందీ తెలుసుకుని, "సరే తల్లీ, యిప్పుడు చేయ గలిగిందేమీ లేదు. నాకు ఆఖరి క్షణాలు సమీపిస్తున్నాయని గ్రహించి, నీకు కబురు చేశాను," అని, దిండుకింది నుంచి ఒక సంచీ తీసి, "వెయ్యిన్నూట పదహారు రూపాయలు కానుకగా యిస్తే, శుభం అట! ఆ మొత్తం ఇందులో వుంది. ఈ డబ్బుతో నీ భర్తను ఏదైనా వ్యాపారం ప్రారంభించమను," అని చెప్పి, సంచిని అనూరాధ చేతిలో పెట్టి కన్ను మూసింది.

తండ్రి వచ్చి, అవ్వ శ్రాద్ధకర్మలు ముగించాక, అనూరాధ ఇంటికి తిరిగి వచ్చి, డబ్బు సంచీని భర్తకిచ్చి, "మన శుభం కోరి అవ్వ యీ వెయ్యిన్నూట పదహార్లిచ్చింది. ఈ డబ్బుతో ఏదైనా వ్యాపారం చెయ్యి. కష్టపడితే ఏడాది తిరిగే సరికి పదివేలు కళ్ళ చూడవచ్చు," అన్నది.

పైడిరాజు పెద్దగా నవ్వి, "ఈ డబ్బుతో సాయంత్రం అలా వెళ్ళి, ఇలా పదివేలు తేగలను. ఈ భాగ్యానికి నిండు ఏడాది ఆగాలా!" అన్నాడు.

అన్నట్టుగానే, పైడిరాజు ఆ సాయంత్రం డబ్బుసంచీ జేబులో పెట్టుకుని, సంతోషంగా ఇంట్లోంచి వీధిలోకి వచ్చాడు. అంతలో ఒక గుర్రపు బండి అటుగా వచ్చి అతడి ముందాగింది.

బండిలో నుంచి ఒక మనిషి తల బయటకుపెట్టి, "అమ్మవారి గుడికి వెళ్ళే దారేదండి?" అని పైడిరాజును అడిగాడు.

"ఇంకా చాలా దూరం వెళ్ళాలి. ఈ లోపల బోలెడు మలుపులు!" అన్నాడు పైడిరాజు.

"మీరూ అటే వెళుతున్నట్టయితే, వచ్చి బండి ఎక్కండి. బండతనికీ, నాకూ కూడా ఊరు కొత్త," అన్నాడు బండిలో మనిషి.

పైడిరాజు బండి ఎక్కి, బండితోలేవాడికి అమ్మవారిగుడి దారి చూపసాగాడు. బండి గుడి దాపులకు చేరగానే బండిలో వున్న మనిషి, పైడిరాజుకు కృతజ్ఞత చెప్పి, హడావిడిగా బండిదిగి వెళ్ళాడు. ఆ తర్వాత తాపీగా బండి దిగుతున్న పైడిరాజుకు, బండిలో పడివున్న ఒక వుత్తరం కనిపించింది. అది హడావుడిగా బండి దిగిపోయిన మనిషి జేబులోంచి జారిపడి వుంటుందని, పైడిరాజు ఊహించి, ఒక పెడగా వెళ్ళి ఉత్తరం చదవసాగాడు. అది నీలకంఠయ్య అనే ఆయన, భార్య భానుమతికిరాసింది.

అందులో ఇలా వుంది: నేను పని మీద పట్నం వెళుతున్నాను. నువ్వామధ్య పాతిక వేలు పెట్టికొన్న హారం నచ్చలేదని, దాన్ని చెరిపించి మరొక నమూనా హారం చేయించుకుంటానన్నావు గదా. ఈ సమయంలో నువ్వు అమ్మవారి గుడి దగ్గిర వుంటావని, ఈ ఉత్తరంతో మనిషిని అక్కడికే పంపుతున్నాను. అతడికి హారం యిచ్చి పంపించు. పట్నంలో మార్పించి తెస్తాను.

ఇది చదివి తన పంట పండిందని పరమానందం చెందాడు, పైడిరాజు.





ఎవరి దగ్గరైనా కుదువ పెట్టి అవసరం గడుపు కుంటానంటే యిచ్చాను. అయ్య గారు ఈసారి పట్నం వెళ్ళినప్పుడు, హారం మార్చే సంగతి చూడవచ్చని చెప్పండి," అన్నది.

బంగారంలాంటి అవకాశం, చేతికి చిక్కి నట్లే చిక్కి చేజారిపోతున్నందుకు, పైడిరాజు విలవిల్లాడిపోయాడు. అయితే, ఆ మరు క్షణం మెరుపులా ఒక ఆలోచన వచ్చింది.

అతడు, భానుమతితో, "అయ్యగారు మరెన్నాళ్ళకు మళ్ళీ ఒకసారి పట్నం వెళతారో తెలియదు. ఇప్పుడే పని పూర్తి చేయించవచ్చు. నా దగ్గర వెయ్యిన్నూట పదహారు రూపాయలున్నవి. మీరనే ఆ పార్వతమ్మకి ఆ డబ్బిచ్చి, హారం తీసుకు రండి. నేను నీలకంఠంగారి నడిగి, ఆ మొత్తం తీసుకుంటాను," అన్నాడు.

భానుమతి, పైడిరాజు యిచ్చిన డబ్బు సంచీ తీసుకుని, "ఈ మొత్తం పార్వ తమ్మకు సరిపోతుందో లేదో అడిగి చూస్తాను. గుడి వెనకే వాళ్ళ ఇల్లు!" అంటూ వెళ్ళిపోయింది.

ఆ తర్వాత నాలుగైదు నిమిషాలు గడవ కుండానే, భానుమతి తిరిగి వచ్చి, హారా న్నొకదాన్ని పైడిరాజుకిస్తూ, "మొన్న అయ్య గారి మేనకోడలి పెళ్ళిలో, అలివేలుగారు వేసుకున్న హారం నమూనాలో కొత్తహారం వుండాలని చెప్పండి," అన్నది.

అతడు క్షణం ఆలస్యం చెయ్యకుండా గుడిలోకి వెళ్ళాడు. గుడిలో జనం పలచగా వున్నారు. పైగా చాలా మంది పిల్లలు, వృద్ధులు.

ఒక పక్కగా కొబ్బరిచిప్పను ముక్కలు చేస్తున్నది, ఒక పాతికేళ్ళ స్త్రీ. పైడిరాజు ఆమెను సమీపించి, "మీరేనా భానుమతి గారు?" అని అడిగాడు.

ఆమె అవునన్నట్టు తలవూపింది. పైడి రాజు ఉత్తరాన్ని ఆమెకిచ్చాడు. ఆమె ఉత్తరం చదివి, "ఇంతకు ముందే హారాన్ని పార్వతమ్మకిచ్చాను. ఆమె తన కూతురు పెళ్ళికి పదిహేను వందలు సర్దమన్నది. సమయానికి చేతిలో డబ్బులేదు. హారాన్ని

పైడిరాజు హారం తీసుకుని పరమానంద పడిపోతూ, తను తరుచుగా దొంగ వస్తు వులమ్మే దేవనాథం దుకాణానికి వెళ్ళి, హారం చూపించాడు.

దేవనాథం హారం కేసి కొంచెం సేపు పరీక్షగా చూసి, తర్వాత తల ఎత్తి పైడి రాజుకేసి కోపంగా చూస్తూ, "ఆహాఁ, ఏరా పైడ్రాజూ! పూతబంగారం మెరుపులతో, నా కళ్ళే కప్పాలనుకున్నావా?" అంటూ హారాన్ని నేలకేసి కొట్టాడు.

పైడిరాజుకు నెత్తినపిడుగుపడ్డట్టయింది. ఎప్పుడూ ఎదుటివారిని మోసంచేసే తను, ఘోరంగా చిత్తయిపోయాడు. భార్యకు ముఖం చూపించడం ఎలా?

పైడిరాజు బాగా పొద్దుపోయే వరకూ వీధుల్లో తిరిగి ఇల్లు చేరే సరికి, ఇల్లంతా చీకటిగా వున్నది. అనూరాధ లేదు. అతడు దీపం వెలిగించగానే, బల్లమీద అనూరాధ వదిలిపోయిన ఉత్తరం కంటపడింది.

అందులో— నా ద్వారా, మీ గురించి విన్న నా స్నేహితురాలు భానుమతీ, ఆమె భర్త నీలకంఠంగారూ మీకు తిరుగులేని గుణపాఠం నేర్పేందుకై, ఈ నాటకం ఆడారు. ఒక దొంగకు లేదా మోసగాడికి భార్య అనిపించుకోవడం కన్నా, చావడం మేలు, నా దృష్టిలో. అవ్వ తన చివరి ఘడియ్యల్లోయిచ్చిన వెయ్యిన్నూట పద హార్లు, నాకు ధైర్యం చెబుతున్నాయి. ఈ డబ్బుతో రెండు ఆవుల్ని కొనుక్కుని, వాటి పాలు అమ్ముకున్నా నా బ్రతుకు గౌరవ ప్రదంగా గడిచిపోతుంది. అందుకే మా ఊరు వెళ్ళిపోతున్నాను. ఇప్పటికయినా మీరు మనసు మార్చుకుని, మీ తెలివి తేటల్ని సక్రమ మార్గంలో వినియోగించు కుని, కష్టపడి పని చేయగలననుకుంటే, రేపు సూర్యాస్తమయంలోగా మా ఊరు రావచ్చును.

ఉత్తరం చదివిన పైడిరాజు కళ్ళముందు పొరలు తొలగిపోయాయి. అతడు మర్నాడు సూర్యోదయం వేళకే, తన ఇంటి గుమ్మం ముందు తలవంచుకుని నిలబడివుండడం చూసి అనూరాధ పరమానందం చెందింది.





# ఓర్వలేనితనం

ఒక గ్రామంలో బలభద్రుడనే పేదకాపు ఉండేవాడు. వాడికి చాలామంది పిల్లలు. బలభద్రుడు రోజూ అడివికి వెళ్లి కట్టెలు కొట్టి తెచ్చేవాడు. వాటిని అమ్మగా వచ్చిన చిల్లరడబ్బులతో పిల్లల కింత గంజి పోసి, తాను తన భార్య కూడా తాగుతూండేవాళ్లు. బలభద్రుడు ఎంత కష్టపడినా ఒక పూట కూడా వాడి కుటుంబానికి కడుపు నిండా తిండి ఉండేది కాదు.

ఒక రోజు ఉదయం బలభద్రుడు గొడ్డలి భుజాన వేసుకుని అడివికిబయలుదేరాడు. దారిలో సన్నగా చినుకు ఆరంభమై, వాడు అడివికి చేరేలోపుగా ధారాపాతంగా వాన కురవసాగింది. అదృష్ట వశాత్తు అడివిలో వాడి కొక పాడుపడిన చావడి కనపడింది. వాడు అక్కడికి పరిగెత్తి చావడి కింద నిలబడి వాన ఎప్పుడు వెలుస్తుందా అని చూడసాగాడు.

కాని వాన ఎంతకీ తగ్గ లేదు. "ఎండు కట్టెలన్నీ తడిసిపోయి ఉంటాయి. తడి కట్టెలు తీసుకుపోతే ఎవరూ కొనరు. ఈ పూట పిల్లలకు గంజికూడా ప్రాప్తంలేదు!" అనుకుంటూ బలభద్రుడు చావడి చుట్టూ కలయచూశాడు. ఒక పక్కగా వాడికొక కొయ్యవిగ్రహం కనబడింది. వాడు ఆశపడి దగ్గిరికి వెళ్లి చూస్తే అది ఒక అమ్మవారి విగ్రహంలాగా తోచింది.

అమ్మవారి విగ్రహమైతేనేం, అయ్యగారి విగ్రహమైతేనేం? అది కొయ్యవిగ్రహం; వానకు తడవ లేదు; పేళ్లు వేస్తే మోపెడు కట్టెలవుతుంది. అడివంతా ఘాలించినా ఇది తప్ప మరొక ఎండుకట్టె దొరికే అవకాశం లేదు. ఈ కట్టెను పేళ్లు వేసి తీసుకుపోతే నాలుగు డబ్బులుగిట్టుతాయి. తానూ, భార్యా, పిల్లలూ ఆ పూటకు ఇంత గంజి కాచుకుని తాగవచ్చు!

ఈ విధంగా ఆలోచించి బలభద్రుడు. గొడ్డలి ఎత్తి విగ్రహం నెత్తిన వెయ్య బోయాడు. అంతలో విగ్రహంలో నుంచి మాటలు వినిపించాయి:

"ఆఁ, ఆఁ! ఆగు! నన్ను తల పగల గొడతావుట్రా, దుర్మార్గుడా? నే నెవరను కున్నావు?"

బలభద్రుడు వెంటనే గొడ్డలి దించి విగ్రహానికి దణ్ణం పెట్టి, "క్షమించు, తల్లీ! ఇందులో నువ్వు ఉన్నావనుకోలేదు. పూజా పునస్కారాలు లేని కొయ్యబొమ్మ అనుకు న్నాను. కట్టెలు కొట్టుకు పోదామని వస్తే వాన వచ్చింది. అడివంతా తడిసిపోయింది. ఇప్పుడు ఈ బొమ్మలోనేమో నువ్వుంటివి! ఇంకేముందీ? మాకూ పిల్లలకూ ఈ పూట గంజి కూడా లేదు!" అన్నాడు ఎంతో వైరాగ్యంగా.

"ఒరే, నీ బీదస్థితి నాకు అర్థమయింది. నాకు నీమీద ఏమీ కోపం లేదు. బీదరికం ఇంతకన్న కూడ ఘోరాలు చేయిస్తుంది. నువ్వు సుఖపడే పద్ధతి నేను చెబుతాను విను. నువ్వు ఇంటికి వెళ్ళి కొత్త కుండ తెచ్చి, నా పేరు తలుచుకుని దాన్ని ఉత్త పొయ్యి మీద పెట్టు. వెంటనే అందులో నీకూ, నీ కుటుంబానికీ కావలసిన ఆహారమంతా ఉంటుంది. ఈ నాటినుంచీ తిండికి కొరతలేకుండా మీరూ, మీ పిల్లలూ హాయిగా ఉండండి!" అన్నది విగ్రహం.

బలభద్రుడు తన చేతిలో ఉన్న గొడ్డలి దూరంగా గిరవాటేసి, విగ్రహం కాళ్ళముందు





సాష్టాంగ పడి లేచి, వానకూడా లక్ష్య పెట్ట కుండా ఇంటికి వెళ్లిపోయాడు.

తన భర్త వట్టి చేతులతో ఇంటికి రావటం చూసి బలభద్రుడి భార్య ఆశ్చర్య పోతూ, "కట్టెలు కొట్టుకు రాలేదా? గొడ్డలి ఏమయింది? ఈ పూట మనమంతా పస్తేనా?" అని ఆదుర్దాగా అడిగింది.

"ఇక మనకు కట్టెలతోనూ, గొడ్డలితోనూ పనిలేదు. అమ్మవారు అనుగ్రహించింది!" అంటూ బలభద్రుడు భార్యకు అడివిలో జరిగినదంతా చెప్పాడు.

బలభద్రుడి భార్య ఒక కొత్తకుండ తెచ్చి దానిపైన మూత ఒకటి పెట్టి, వట్టి పొయ్యి మీద పెట్టి దించింది. మూత తీసి చూస్తే అందులో సమస్తమైన ఆహారాలూ, పిండి వంటలూ కూడా ఉన్నాయి. భార్యాభర్తలూ, పిల్లలూ కూడా తమ జన్మలో మొదటిసారి సుఖంగా భోజనంచేసి పడుకుని హాయిగా నిద్రపోయారు.

అది మొదలు బలభద్రుడి కుటుం బానికి తిండికొరత లేదు. వాళ్లు పూటపూటా షడ్రసోపేతంగా భోజనం చేస్తున్నారు. వాళ్లు తినటమే గాక, ఇరుగుపొరుగు వాళ్లను పిలిచి వారికి కూడా మృష్టాన్న భోజనాలు పెడుతున్నారు.

బలభద్రుడి ఇంటి పక్కనే ఇంకొక ఇల్లు న్నది. ఆ ఇంటావిడ పేరు మండోదరి. జన్మలో ఎన్నడూ గంజి తప్ప ఎరగని బలభద్రుడి కుటుంబం రోజూ సుష్టుగా భోజనం చేస్తూండటం గమనించి మండో దరి, "ఇంత ఉన్నవాళ్లం మాకే సాధ్యం కాదుగదా, ఈ గర్భదరిద్రులు రోజూ పిండి వంటలు ఎలా చేసుకుంటున్నారు? ఇంత లోనే వీళ్లకింత సిరిఎత్తుకోవడానికి కారణ మేమిటి?" అనుకున్నది.

ఆవిడ బలభద్రుడి చిన్న కొడుకును పిలిచి, "ఒరే, మీ నాన్నఅడివికిపోయి కట్టెలు తీసుకురాటం కూడా లేదు. ఈ వంట సరుకులన్నీ ఎట్లా తెస్తున్నారు? రోజూ మీ అమ్మ ఇంత పెద్ద వంటలు ఒంటరిగా ఎట్లా చెయ్యగలుగుతున్నది?" అని అడిగింది రహస్యంగా.

బలభద్రుడి కొడుకు మండోదరితో నిజం చెప్పేశాడు. "అడివిలో దేవత అనుగ్రహించి మాకు కుండలో అన్నీ ఇస్తున్నది. మా అమ్మ వంట చెయ్యదు, మా నాన్న సరుకులూ తీసుకు రాడు!" అంటూ వాడు అడివిలో జరిగిన వృత్తాంత మంతా చెప్పాడు.

ఇది వినేసరికి మండోదరికి పట్టరాని అసూయ కలిగింది. ఆవిడ తలకు గుడ్డ కట్టుకుని మూలుగుతూ మూల పడు కున్నది. వంట చెయ్యలేదు. "అమ్మా, అన్నం పెట్టు!" అని పిల్లలు దగ్గిరికి వస్తే, వాళ్లను తిట్టి కసిరి కొట్టింది.



భోజనం వేళకు మండోదరి భర్త ఇంటికి వచ్చి పొయ్యి రాజకపోవటం చూసి, "ఏం జరిగింది?" అని అడిగాడు.

"ఏం జరిగిందా? దేశంలో అడ్డమైన వాళ్లూ దేవత అనుగ్రహం సంపాదించి పొయ్యికూడా వెలిగించ కుండా పంచభక్ష్య పరమాన్నాలూ మెక్కుతుంటే నేను రోజల్లా ఒళ్లు విరుచుకుని అంతులేని చాకిరీ చెయ్యవలిసివచ్చింది!" అన్నది మండోదరి.

ఆవిడ ద్వారా విషయమంతా తెలుసు కుని మండోదరి భర్త, "అయితే నన్ని ప్పుడేం చెయ్యమంటావు?" అన్నాడు.

"ఇంకా అడుగుతావెందుకు? గొడ్డలి పట్టుకుపోయి అడివిలో ఉండే అమ్మవారిని తల పగలగొడతానని బెదిరించి వంట వరం పొందిరా! నేను ఇకమీదట వంట చేసేదిలేదు!" అన్నది మండోదరి చాలా కోపంగా

"దేవతలను ఎక్కడైనా తల పగలగొడ తారా?" అన్నాడు భర్త.

"నీకు కొంచెమన్నా జ్ఞానంలేదు. మొక్కితే వరమియ్యని దేవత మొట్టితే ఇస్తుంది!" అన్నది మండోదరి.

తన భార్య చెప్పిన ప్రకారం చెయ్యకపోతే తనకు శాంతి ఉండదని తెలిసి, మండోదరి భర్త గొడ్డలి భుజాన వేసుకుని అడవికి వెళ్లాడు. కొంచెం వెతికిన మీదట అతనికి అడివిలో చావిడీ, అమ్మవారి కొయ్యవిగ్ర హమూకనిపించాయి. మండోదరి భర్త అమ్మ వారి విగ్రహాన్ని సమీపించి గొడ్డలి ఎత్తాడు.

మరుక్షణం భూమి దద్దరిల్లింది. విగ్రహం నుంచి మెరుపులాటి కాంతి వచ్చి అతని కళ్లు గుడ్డిగా అయిపోయాయి. ఎవరో తన్ని నట్టుగా అతను పడిపోయాడు. ఆ స్థితిలో అతనికి ఒక భీకరమైన కంఠస్వరం విని పించింది:

"నీచుడా! నన్నే తలమీద కొడతావుట్రా! ఎవరనుకున్నావు?"

మండోదరి భర్త వణికిపోయాడు. అతని శరీరమంతానజ్జునజ్జు అయినట్టయి,మంట లెత్తసాగింది.

"క్షమించు,తల్లీ! నేరక అపరాధం చేశాను. ఈ పని చేస్తేనే నువ్వు ఆ బలభద్రుడి పైన అనుగ్రహించావు. నాపై ఎందుకాగ్రహించు తున్నావు?" అన్నాడతను.

"బలభద్రుడు గర్భదరిద్రుడు! నువ్వు దరిద్రుడివి కావే? నిన్నెందుకు క్షమించాలి?" అన్నది విగ్రహం.

"వాడు దరిద్రుడైతే నేను అజ్ఞానిని! క్షమించు, తల్లీ!" అంటూ మండోదరి భర్త బోర్లాపడి ఏడిచాడు.

"ఒక్క షరతు మీద నిన్ను ఈసారికి క్షమిస్తాను. నేను బలభద్రుడికి పాత్రలో అన్నీ వచ్చేట్టు అనుగ్రహించాను గాని, నెయ్యి ఇవ్వటం మరిచాను. పాపం వాళ్లంతా నెయ్యిలేని కూడు తింటున్నారు. కనక, నువ్వు ఇంటికి వెళ్లి రోజూ వాళ్లకు సేరు చొప్పున మంచి నెయ్యి ఇస్తూ ఉండు! అందుకు ఒప్పుకుంటే నిన్ను క్షమిస్తాను!" అన్నది అమ్మవారి విగ్రహం.

"నీ ఇష్టం, తల్లీ! నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను. నా తప్పుమటుకు క్షమించు!" అన్నాడు మండోదరి భర్త. అతని బాధలన్నీ తీసేసినట్టు పోయాయి. అతను ఇంటికి తిరిగివచ్చి జరిగినదంతా భార్యకు చెప్పి, "స్త్రీ బుద్ధి ప్రళయాంతకమని ఊరికేఅన్నారా? ఇకనుంచీ రోజూ సేరు నెయ్యి బలభద్రుడి ఇంటికి పంపుతూ ఉండు!" అన్నాడు.

చేసేదిలేక మండోదరి భర్త చెప్పినదానికి అంగీకరించి, ఇష్టం లేకపోయినప్పటికీ ప్రతిరోజూ బలభద్రుడి ఇంటికి సేరు నెయ్యి పంపుతూండేది.



# ప్రకృతి వింతలు :

## బంగారపు చెట్లు !



మా దగ్గర వెయ్యి రూపాయలు చెల్లించి ఒక టేకుమొక్క నాటించండి. ఇరవై సంవత్సరాలు దానిని పెంచి పెద్ద చేసే బాధ్యత మాది. ఇరవై యేళ్ళ తరవాత మీకు వందరెట్లు, అంటే లక్షరూయలు లభిస్తాయి— అనే ప్రకటనలు ఇటీవల ఎక్కువయ్యాయి. అంటే టేకు కలప బంగారమంత విలువయిన దన్నమాట. అంతేకాదు. ఇద్దరు థాయ్ పరిశోధకులు 'టేకు' అంటేనే బంగారం అంటున్నారు. 'న్యూట్రాన్ ఏవియేషన్' అనే టెక్నిక్‌ను ఉపయోగించి, వాళ్ళు టేకు మొక్కలను కోసిన రంపపు పొడిలో బంగారపు రేణువులు ఉండడం కనుగొన్నారు. ఈ రకం మొక్కలకు వాళ్ళు 'సాక్ తాంగ్' అని పేరు పెట్టారు. థాయ్ భాషలో 'సాక్' అంటే టేకు; 'తాంగ్' అంటే బంగారం. దక్షిణ భారతీయులు కూడా కొందరు బంగారాన్ని 'తంగం' అని అంటారు.



## చెట్లకు వలయాలు!

ఈ నాడు రకరకాల సంస్థలు ఏర్పడుతున్నాయి. అయితే, చెట్లే సభ్యులుగా గల సంస్థను గురించి విన్నారా? ఉత్తరప్రదేశ్‌లో 'ఎలైట్ మదర్ ట్రీస్' అనే సంస్థను ఏర్పాటు చేశారు. వేప, జామ, చింత, మామిడి, ఉసిరిక, సిందూరం మొదలైన జాతులకు చెందిన దాదాపు 3,500 చెట్లు ఈ సంస్థలో సభ్యులుగా ఉన్నాయి.ఈ సంస్థలో సభ్యత్వం పొందిన చెట్లకు ఆరోగ్యకరమైన విత్తనాలు పొందడానికి ప్రత్యేక రక్షణ ఏర్పాట్లు చేస్తారు. ఈ సంస్థలో సభ్యత్వం పొంధాలంటే మొదట ఆ చెట్లు చూడడానికి ఆరోగ్యంగానూ, నిటారు బోదె, పొందికగా ఉన్న కొమ్మలూ, గుబురుగా ఆకులూ ఉండాలి. ఇటువంటి చెట్లను 'మదర్ ట్రీస్' అని అంటారు. సభ్యత్వం పొందిన చెట్టు బోదె చుట్టూ మొదట పసుపు పచ్చ వలయం వేస్తారు. ఆ తరవాత వాటి విత్తనాలను ప్రత్యేకంగా మొలకెత్తింప జేసి, పరీక్ష చేసి చూస్తారు. వీటిలో నెగ్గినవృక్షాలను 'ఎలైట్ మదర్స్' అని పిలుస్తారు. ఇటువంటి వృక్షాల బోదెల చుట్టూ రెండు వలయాల గుర్తులు వేస్తారు. వాటి విత్తనాలకు వేరొక చోటికి పంపి, అవి చక్కగా మొలకెత్తి ఆరోగ్యంగా, ఉన్నాయని తెలిశాక, అటువంటి చెట్టు బోదెల చుట్టూ మూడవ పసుపు రంగు వలయం వేస్తారు.



## ఎత్తయిన వృక్షం!

కాలిఫోర్నియా లోని హంబోల్ట్ స్టేట్ పార్క్‌లో ఉన్న సీర్రా ఎర్ర చందనం వృక్షం ఎత్తు 113 మీటర్లు. ఈ వృక్షమే ఈనాడు ప్రపంచంలో కెల్లా చాలా ఎత్తయిన వృక్షం అని చెబుతున్నారు. దీనికి 'హ్యారీ కోల్' అని పేరుపెట్టారు. 1988వ సం. లోకనుగొన బడిన ఈ వృక్షం బోదె చుట్టూ వున్న వలయాల గుర్తులను బట్టి చూస్తే దీని వయసు 3,000 సం॥ ఉండవచ్చని చెబుతున్నారు. ఆస్ట్రేలియా, విక్టోరియాలోని 'యూకలిప్టస్ వృక్షమే చాలా ఎత్తయినదిగా భావించబడేది. అయితే, అక్కడ మరొక యూకలిప్టస్ వృక్షం 143 మీటర్ల ఎత్తుతో ఉండే దనికూడా చెబుతున్నారు.


Vacation time is here again
Time to put text books away
So we've come together to say
Have fun and 'Happy Holidays'!

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వాడని కలిమి!

రెండవ ఫోటో : వీడని చెలిమి!

పంపినవారు : పొన్నపల్లి మైత్రీమాధుర్య, మలికిపురం — 533 253 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**